





# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

THURSDAY, THE 7TH JULY 1955

~~VOLUME I-A No. 2~~ 8

Volume 1, No. 7

PRINTED BY
THE SUPERINTENDENT, ANDHRA GOVERNMENT PRESS,
KURNOOL
1956
Price [illegible]

## CONTENTS

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

---

**Thursday, 7th July 1955.**

---

House met in the Assembly Hall at Eleven of the clock, Mr. Speaker (The Hon'ble Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS.

### Starred Questions.

*Grow More Food Campaign.*

11. Q.—SRI S. VEMAYYA:—Will the Hon. the ief Minister be pleased to state whether the Grow re Food Campaign is in force now?

THE HON. SRI B. GOPALA REDDI:—The answer is in the affirmative.

SRI S. VEMAYYA:— ఇప్పుడు ఈ Grow More Food mpaign సాగుబడి భూములకు వర్తిస్తుందా అని ప్రభుత్వాన్ని అడుగు న్నాను. లోగడ ఈ scheme క్రింద భూములు సాగుబడి చేసేదానికి 'mission ఇస్తూ ఉండేవారు. ఇప్పుడు ఈ Grow More Food mpaign లేదు, కాబట్టి ఇవ్వడం లేదని జిల్లాలలో అధికారులు చెప్పు న్నారు. దాన్ని గురించి ప్రభుత్వము ఏమి చెప్పుతుంది.

THE HON. SRI B. GOPALA REDDI:— సభ్యుని యొక్క ఉద్దేశమేమిటో సరిగా ఇంకొక ప్రశ్నవేస్తే జవాబు చెప్పుతాను.

SRI P. SUNDARAYYA:— స్థానిక ఉద్యోగస్తులు Grow ore Food Campaign క్రింద యిచ్చినటువంటి భూములను ఇప్పుడు campaignలేదు, కాబట్టి తీసుకొంటున్నామని చెప్పుతున్నారు. మంత్రి కేమో campaign ఉన్నదని చెప్పుతున్నారు. అయితే అధికారులు

[7th July 1955

THE HON. SRI B. GOPALA REDDI :- ఈ campaign ముందుపద్ధతి ప్రకారం యిప్పుడు లేకపోవచ్చును. అయిన దీనిలో 14 రకము లైనటువంటివి వున్నాయి. Pump sets, filter points, fertilisers వగైరా అంతాకూడ ఇప్పుడు Grow More Food Scheme లో వున్నాయి. అందువల్ల, Grow More Food Campaign ఉన్నది. మీరు చెప్పిన విధంగా ఈనాడు లేకపోవచ్చును. దాన్ని గురించి వేరేప్రశ్న వేస్తే సమాధానం చెప్పతాను.

SRI C. SUBBARAYUDU :- ఈ Grow More Food Campaign క్రింద ఇంతకుముందు irrigation schemes విషయములో వాటానుంచి 2½ per cent return వస్తేగాని వాటిని తీసికొనుటకు అవకాశము లేకపోయింది. కాని కొన్ని precarious cases లో 2½ per cent return రావడానికి అవకాశముండదు కనుక ఆ percentage తగ్గించడానికి అవకాశమున్నదా అని మంత్రిగారిని అడుగుతున్నాను.

THE HON. SRI B. GOPALA REDDI :— దాన్ని గురించి యిప్పుడు ప్రత్యేకంగా ఏమీ చెప్పలేకపోతున్నాను అది ఆలోచించబడుతుంది.

SRI R. B. RAMAKRISHNA RAJU :- ఈ Grow More Food Scheme క్రింద బావులకు subsidies యివ్వడము వాటి repairs కు ఎద్దులకు ఇవ్వడం యిటువంటివన్ని ఉన్నాయా ఇప్పుడు?

THE HON. SRI B. GOPALA REDDI :-ఇప్పుడు ఈ Grow More Food Scheme లో 14 items ఉన్నాయని చెప్పాను. Tank improvement schemes, special minor irrigation schemes, Public Works Department small irrigation schemes, supply of oil engines under hire purchase system, filter point tube wells, distribution of tractors under hire purchase system, distribution of Ammonium Sulphate, urban compost scheme for the multiplication and distribution of paddy millets, plants and green manure seeds, control of pests and diseases, artisan wells, యీ రకంగా 14 items ఉన్నాయి.

SRI PILLALAMARRI VENKATESWARLU :— Grow More Food Campaign క్రింద గతములో బంజరు భూములను సాగుచేయడానికి అవకాశము కల్పిస్తూ వుండేవారు ప్రభుత్వము. ఈ నాడుకూడా అలాంటి అవకాశము ప్రభుత్వము కల్పిస్తుందా? ఇంతవరకు కల్పించకపోతే యిక ముందైనా కల్పిస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI:—ఇది పెద్దసమస్య. దాన్ని ప్రత్యేకంగా అడిగితే ప్రత్యేకంగా జవాబు చెపుతాను.

SRI G. YELLAMANDA REDDI: —అధ్యక్షా! ఈ Grow More Food Scheme క్రింద యిదివరకు చెరువుల క్రింద ఉన్న అనేక భూములు సాగుబడికి వచ్చినాయి. వాటన్నిటికి ఇప్పుడు eviction notices యిచ్చినారు. అనేకమంది చాలా రోజులుగా వాటిని బాగుచేసుకొన్నారు. కనుక వాటికి యీలాంటి నోటీసులేవీలేకుండా reconcile చేయడానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా? filter pointsకు సంబంధించిన సమస్య కాదుయిది. బంజరు భూములకు యితర పొరంబోకులకు సంబంధించిన సమస్యయిది.

THE HON. SRI B. GOPALA REDDI:—అమాదిరిగా ప్రశ్న అడిగివుంటే, దానికి సరియైనటువంటి సమాధానము చెప్పి యుందును. కాని ఇప్పుడు Grow More Food Campaign అమలులో వున్నదా అంటే ఉన్నదని చెప్పాము.

SRI B. SANKARIAH:— ఈ Grow More Food Campaign అమలులో వున్నప్పుడు, దానిక్రింద ఇచ్చినటువంటి భూముల సాగుకు అటంకము లేకుండా వుండేదానికి ఇప్పుడైన ప్రభుత్వము చర్య తీసుకుంటుందా ?

THE HON. SRI B. GOPALA REDDI:— ఈ schem e అమలులో వచ్చినప్పుడు ఉన్నటువంటి పరిస్థితులు యిప్పుడు వున్నాయో లేవో ఆలోచించవలసియున్నది. ఈ పది సంవత్సరములలో వచ్చినటువంటి మార్పులవల్ల, దాంట్లోకూడా కొన్నికొన్ని మార్పులు జరుగవలసియుంటుంది.

*Length of roads in the State.*

15—

*104. Q.—SRI S. VEMAYYA:—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) the length of roads maintained as (i) National Highways, (ii) State Highways, (iii) District Boards in the state now; and

(b) the condition of them in general?

THE HON. SRI N. SANJEEVA REDDI:—

(a) (i) The length of roads maintained is as shown below:—

Under the control of Government Highways Department—

| | | |
|---|---|---|
| | | *Miles.* |
| National Highways | ... ... ... | 937 |
| State Highways | ... ... ... | 1,363 |
| Major District Roads | ... ... ... | 4,334 |
| Other District Roads | ... ... ... | 9 |
| | Total ... | 6,643 |

(ii) Roads under the control of District Boards:—

| | | |
|---|---|---|
| | | *Miles.* |
| State Highways | ... ... ... ... | 1 |
| M.D.Rs. | ... ... ... ... | 2,398 |
| Other District Roads | ... ... ... | 2,799 |
| Village Roads | ... .. ... ... | 3,623 |
| | Total ... | 8,821 |

(b) The condition of the roads maintained by the Government as National Highways, State Highways and the Major District Roads, etc., is reported to be generally fair. Action is also being taken, subject to financial limitations, to black-top stretches of these roads which carry particularly heavy intensity of traffic. As regards District Board Roads, however, it is reported that their condition is not up to the mark owing to the inability of the District Boards to provide adequate funds for their maintenance.

❧ రోడ్లయొక్క పరిస్థితి విషయంలో Major District Roads న్నూ, National Highways Roads న్నూ ఒకరకంగా ఉన్నాయి. కాని ఆర్థిక స్తోమతును black-top చేయడంకూడా

కొంత జరుగుతూ ఉన్నది. జిల్లాబోర్డు రోడ్ల విషయంలో, వారికి ఉన్న deficit budget సమస్యవల్ల ఈ రోడ్లు బాగా ఉన్నాయని చెప్పడానికి వీలులేదు. కొంచెము డబ్బు ఎక్కువగా ఉంటే, వాటిని బాగుపరచడానికి వీలు అవుతుంది.

SRI S. VEMAYYA:—ముఖ్యంగా జిల్లాబోర్డుల అధ్వర్యాన ఉన్నటువంటి రోడ్లు, మామూలుగా రోడ్లు లేనటువంటి గ్రామాలలో పరిస్థితులు ఏవిధంగా ఉన్నాయో ఆవిధంగా ఉన్నాయనేది ప్రభుత్వానికి తెలుసునా? తెలిసితే ఇప్పుడు మనము అన్ని గ్రామాలలో రోడ్లు వేయాలని పురోగమిస్తున్నటువంటి పరిస్థితులలో ఉన్నరోడ్లను సరిచేయుటకు ప్రభుత్వము ప్రయత్నిస్తుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:— అంటే, మీ ఉద్దేశ్యము ఉన్న రోడ్లనుమాత్రం బాగుపరచవలెననేనా ? కొత్త రోడ్లను వేస్తూ ఉన్న రోడ్లనుగూడ బాగుచేయవలెనని అనుకుంటాను. ఆ జిల్లా బోర్డుకు ఉన్న డబ్బునుబట్టి చర్య తీసుకొంటుంది.

SRI P. RANGA REDDI:-ఇప్పుడు State Highways లో ఉన్నటువంటి కొన్ని మైళ్ళను National Highways లోనికి తీసుకోడానికిని, అలాగే Majar district roads నుంచి కొన్ని మైళ్లను State Highways లోనికి తీసుకోడానికి ప్రభుత్వమేమైనా తలపెట్టిందా ? అట్లైన దానిని పంచవర్ష ప్రణాళికలో చేర్చడానికి ప్రణాళిక ఉన్నదా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:— ఇప్పుడు Highways Department లో కొన్ని ఉన్నాయి మరికొన్ని చేర్చుటకు పంచవర్ష ప్రణాళికలో ప్రయత్నం చేస్తున్నారు. ఎంతవరకు మాకు డబ్బు లభిస్తుందో దాన్నిబట్టి తీసుకోగలమని చెప్పగలను.

SRI G. YELLAMANDA REDDI:— అధ్యక్షా! ఈ జిల్లా బోర్డు రోడ్లు అనేకము ఇదివరలో ప్రారంభించి మధ్యలో విడిచిపెట్టబడినాయి కాబట్టి రెండవ పంచవర్ష ప్రణాళికలో వాటిని పూర్తిచేయడానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:-అన్నిరోడ్లు ప్రభుత్వమే తీసుకొని చేయవలెనంటే, కొన్నికోట్ల రూపాయలు ఖర్చు పెట్టవలసియుంటుంది. అది సాధ్యంకానిపని. జిల్లాబోర్డులకే ఇంకా ఎక్కువడబ్బు యిచ్చి వాళ్లతోనే చేయించవచ్చును. అంతేకాని, అన్నీ ప్రభుత్వమే చేయుటకు వీలులేదు.

SRI P. VENKATASUBBAYYA:—జిల్లాలోఉన్న రోడ్ల పొడుగునుబట్టి, ఇంత Percentage Highways లోను ఇంత Percentage జిల్లాబోర్డులలోను ఉండాలనే నియమము ఏదైనా ఉన్నదా ?

[7th July 1955

THE HON. SRI N. SANJEEVA REDDI :— అవసరాన్నిబట్టి ఆ రోడ్డుయొక్క ప్రాముఖ్యతనుబట్టి, అది ఇంకో జిల్లాకు connect చేస్తుందా లేక ముఖ్యమైన పట్టణాలను connect చేస్తుందా అని చూచి, దాని ప్రాముఖ్యతనుబట్టి ప్రభుత్వము స్వాధీనము చేసు కొంటుందేగాని, జిల్లాలో ఉన్న రోడ్ల పొడవునుబట్టికాదు.

SRI RAJA SAGI SURYANARAYANA RAJU :— అధ్యక్షా! ఈ జిల్లాబోర్డు రోడ్లు మా జిల్లాలో మొన్న గాలివాన వచ్చినప్పుడు, గండ్లు పడ్డాయి. వాటికిగాను ప్రభుత్వము ఏమైనా గ్రాంటుఇచ్చి, ఆ గండ్లు పూడిపిస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :— వరదలలో పోయినటువంటి రోడ్లకుగాను ప్రభుత్వము కొంత గ్రాంటు ఇచ్చింది. మీ జిల్లాలోనేకాదు, ఇదివరలో పశ్చిమ గోదావరి జిల్లాలో తుపాను వచ్చినప్పుడు పోయినవాటిని బాగుపరచడానికి ప్రత్యేకమైన గ్రాంట్సు ఇచ్చింది. అరకంగా జిల్లాబోర్డువారు కోరితే తప్పకుండా ప్రభుత్వము ఇస్తుంది.

SRI RAJA SAGI SURYANARAYANA RAJU :— ఇప్పుడు ప్రత్యేకంగా special officers ఉన్నారు. ప్రజలు ఎవరూ లేరు.

THE HON. SRI N. SANJEEVA REDDI :— ఔను; స్పెషల్ ఆఫీసర్సే ఆ విధంగా కోరవచ్చు.

SRI R. B. RAMAKRISHNA RAJU :— ఇటీవల కొన్ని famine roads వేసినారు. అవి వేశారేగాని వాటిని బాగుచేయడంగాని సవరించడంగాని జరుగలేదు. వాటినిగురించి ప్రభుత్వమేమైనా చర్య తీసు కొంటుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :— మరల famine వచ్చినప్పుడే వాటిని బాగుచేయడానికి అవకాశం ఏర్పడు తుంది. అంతేకాని, ఇప్పుడు ప్రతి రోడ్డును జిల్లాబోర్డే చేయాలంటే సాధ్యపడదు. అయితే ప్రత్యేకంగా ఏదైనా చాలా worst గా ఉన్న రోడ్డువుంటే అటువంటిది చేయించవచ్చు. మీ చిత్తూరు జిల్లాకుకూడ అటువంటివాటికి కొంత grant ఇవ్వబడింది.

SRI C. SUBBARAYUDU :— ఈ Provincial Highways కుగాని, జిల్లాబోర్డుకుగాని grants ఇచ్చేటప్పుడు, ఒక జిల్లాలోని mileage ని బట్టి grants allot చేస్తారా, లేకపోతే ఇంకేదైనా ఒక basis ఉన్నదా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :— దీనికి సమా ధానం వెంకటసుబ్బయ్యగారు అడిగిన ప్రశ్నకు చెప్పాను. అరోడ్డు యొక్క ప్రాముఖ్యతనుబట్టి, అదిinter-district connecting

రోడ్డు లేక రెండు important townsకు connecting రోడ్డు లేక ఎక్కువ వ్యాపారానికి సంబంధించి traffic గల రోడ్డు అని ఈ విధంగా ఏదైన దానికి ప్రాముఖ్యత ఉంటే, దాన్ని ప్రభుత్వము తీసుకొని State Highways కు మార్చుకొంటుంది. అంతేగాని జిల్లాలో ఇంత తీసుకోవాలనే నియమంగాని, ఇన్ని మైళ్ళు తీసుకోవాలనేదిగాని లేదు.

*Settlement and Assistant Settlement Officers in the State.*

16—

*53. Q.—SRI S. VEMAYYA:—Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) (1) the number of Settlement Officers;

(2) the Assistant Settlement Officers in the State now; and

(b) the number of Harijans out of them?

THE HON. SRI K. CHANDRAMOULI:—

(a) (1) There are two Settlement Officers in the State.

(2) There are four Assistant Settlement Officers and three Additional Assistant Settlement officers.

(b) There are no Harijans working as Settlement Officers, but there are three Harijan Deputy Collectors working as Assistant Settlement Officers.

ఇద్దరు సెటిల్‌మెంటు ఆఫీసర్లు, నలుగురు అసిస్టెంటు సెటిల్మెంటు ఆఫీసర్లు, ముగ్గురు అడిషినల్ సెటిల్మెంటు ఆఫీసర్లు వున్నారు అందులోవారు ముగ్గురు అసిసెంటు సెటిల్మెంటు ఆఫీసర్లు హరిజనులు.

*Transfer of Health Inspectors.*

17—

*94. Q.—SRI S. VEMAYYA:—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) Whether it is a fact that the Health Inspectors are transferred statewide; and

(b) If so, the reasons therefor?

THE HON. SRI K. VENKATA RAO:—

(a) Yes.

(b) Almost ever since its inception, the service has been a Provincial Service with liability of its members to serve anywhere in the State. Epidemics do not respect district boundaries and Government must have the power to mobilise all personnel when an emergency arises.

SRI S. VEMAYYA:—చిన్న ఉద్యోగస్థులైన Health Inspectors ను రాష్ట్ర వ్యాప్తంగా transfer చేస్తే, వారికి ఎక్కువ యిబ్బందులు కలుగుతున్నవి. కాబట్టి ప్రభుత్వము యిప్పటికైనా consider చేసి బదలాయింపులు స్వంత జిల్లాప్రక్క జిల్లాకైనా పరిమితము చేస్తూ ఇప్పుడు ఉన్నరాష్ట్ర వ్యాప్తముగా transfer చేసే పద్ధతిని మార్చుటానికి ప్రభుత్వము పూనుకుంటుందా ?

THE HON. SRI K. VENKATA RAO:— పూనుకొనేందుకు వీలులేదు. దానికి కారణం నా జవాబులోనే వివరించాను.

SRI G. YELLAMANDA REDDI:—Emergency విషయంకాబట్టి యిలాంటి పవరు కావాలని మంత్రిగారు చెప్పారు. అలాంటి emergency లాంటి epidemics వచ్చినప్పుడు బదిలీలు చేయడము సహజమే. అటువంటి emergency లేనప్పుడైనా వారిఇరుగుపొరుగు జిల్లాలకు పరిమితము చేయడానికి ప్రభుత్వానికి ఆక్షేపణ వుంటుందా ?

THE HON. SRI K. VENKATA RAO:— అవసరము లేనప్పుడు ఎవ్వరునూ transfer చేయబడరు.

SRI P. VENKATASUBBAYYA:- స్టేటులో అక్కడక్కడ సహజంగా సంభవించే రోగాలకు హద్దువుండదు కాబట్టి, యీ ఉద్యోగస్థులను transfer చేయడము సహజమని మంత్రిగారు అంటున్నారు. అటువంటప్పుడు యీ transfers వల్ల Inspectors కు రోగాలు వచ్చినప్పుడు, వారికి allowances యేమైనా ప్రభుత్వం యిస్తుందా ?

(*No Answer.*)

SRI C. SUBBARAYUDU:—Transfers చేసే టప్పుడు Statewide గా చేస్తున్నారు. అందులో యీ Health Inspectors కు promotions కు కూడా అవకాశం వున్నదా ?

THE HON. SRI K. VENKATA RAO:— ఈ విషయములో చల్లా సుబ్బారాయుడుగారికి యింత ఆశ్చర్యము ఎందుకు కలిగిందో తెలియడంలేదు. ప్రతి ఉద్యోగికి ఒక గ్రేడు వుంటుంది ఆ గ్రేడు ప్రకారము ప్రతి సంవత్సరము వారికి promotion వస్తూనే వుంటుంది.

*Improvements to the Kurnool Railway Station.*

18—

*431. Q.—SRI P. RANGA REDDI:—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) whether the Government have suggested to the Union Government any improvements to the Kurnool Railway Station;

(b) whether the Union Government have taken any action on that request; and

(c) if so, the improvements that are likely to be made to improve the Kurnool Railway Station?

THE HON. SRI G. LATCHANNA:—

(a) The Government of India have not been approached directly. But the General Manager, Central Railway, has been addressed in the matter.

(b) and (c) The Central Railway has made out proposals for carrying out certain improvements to the Kurnool Railway Station and they will be taken up for execution after the Railway Board sanctions them. The improvements contemplated relate to provision of better waiting-room facilities, provision of refreshment room, tonga-shed and car-park, paving of the platform, electrification and water-supply and drainage arrangements.

ఇండియా ప్రభుత్వము వారికి యీ విషయము గురించి వ్రాయలేదు. అయినను సెంట్రల్ రైల్వేవారికి మాత్రం యీ విషయము తెలియ జేయబడ్డది. సెంట్రల్ రైల్వేవారు కర్నూలు రైల్వే స్టేషను అభివృద్ధి చేయటానికి చర్య తీసుకునే విషయములో తీర్మానించుకున్నారు. అనుమతి కూడా పొందారు. **Waiting Rooms**

లోని facilities improve చేయటానికి Refreshment Rooms కట్టటానికి, Tongas, Cars నిలిచేటందుకు పార్కు కట్టడానికి Platform ను improve చేయడానికి, electrification, drainage and water facilities ను improve చేయడానికి అనుమతిపొందారు. త్వరలోనే పని ప్రారంభించబడుతుంది.

SRI P. RANGA REDDI :—అనేకమైన అవసరాలను తీర్చు కోటానికి, అత్యవసరమైన చర్యతీసుకునేటందుకు, ఆంధ్ర ప్రభుత్వము నేరుగా కేంద్ర ప్రభుత్వమును అర్థించేవారు యీ విషయములో కేంద్ర ప్రభుత్వానికి నేరుగా ఎందుకు వ్రాయలేదు? పోనీ రైల్వేశాఖ ఉపమంత్రిగారు యిక్కడికి వచ్చినప్పుడైనను యీ విషయము నేరుగా చెప్పారా? కర్నూలు ఆంధ్రరాష్ట్ర రాజధానిగా ఏర్పడినందువల్ల రైల్వే రవాణా రద్దీ ఎక్కువైం దని గ్రహించి, సత్వరంగా సదుపాయాలను సాధించటానికి ప్రభుత్వము యిప్పుడైన చర్య తీసుకుంటుందా ?

THE HON. SRI G. LATCHANNA :—కర్నూలు స్టేషను దానికి వున్న రైలు మార్గము సెంట్రల్ రైల్వేవారిది. దానిమీద అధికారము వారిది. అందువల్ల 1953 వ సంవత్సరము డిశంబరు లోనే రైల్వేవారికి యీ విషయము వ్రాయబడ్డది. వచ్చిన పెద్దలకు గూడా మనవి చేయబడ్డది. Reminders కూడ యివ్వబడ్డవి, రైల్వే బోర్డువారు అనుమతి యిచ్చారు. అందువల్ల యీ కార్య క్రమాలు అమలు జరుపబడబోతున్నవి.

SRI VAVILALA GOPALAKRISHNIAH :— ఇప్పుడు ప్రభుత్వము కలిగించబోయే సౌకర్యాలలో రైల్వే స్టేషనులో 3 వ క్లాసు ప్యాసింజర్లకు గూడా త్వరగా టికట్లు అందేటట్లు రెండు చోట్ల బుక్కింగు ఆఫీసులు పెట్టించి, యింకను వారు కూర్చునటానికి ఎక్కువగా సౌకర్యాలు వుండేటట్టు ప్రభుత్వమువారు చూస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—III Class Waiting Room కు improvement జరుగుతుంది అక్కడనే Booking Office వుంటుంది. అందుచేత కొంచెము ముందుగా వెళ్లినవారికి ముందుగానే టికట్లు అందుతవి.

SRI P. GUNNAYYA :— అధ్యక్షా, కర్నూలు రాజధాని కావ డము వల్ల, బెజవాడనుండి M. L. A. లు, ప్రజలు ఒకే బండిలో రావటానికి అసౌకర్యంగా వుంటున్నది. అందువల్ల ఒకే బండి కాకుండా మరొక Express బండిని వేయటానికి ప్రభుత్వమువారు ఏర్పాటు చేస్తారా ?

MR. SPEAKER : దానికి ప్రత్యేక ప్రశ్న వేయండి.

7th July 1955]

*Co-operative Senior and Junior Inspectors in the State.*

19—

*40. *Q.*—SRI S. VEMAYYA:—Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state—

(*a*) the number of Co-operative Inspectors (Senior and Junior) in the state now, and

(*b*) the number of Harijans out of them?

THE HON. SRI D. SANJIVAYYA:—

| | | |
|---|---|---|
| (*a*) Number of Senior Inspectors. | ... | 556 |
| Number of Junior Inspectors. | ... | 531 |
| (*b*) Number of Harijans among Senior Inspectors. | .... | 17 |
| Number of Harijans among Junior Inspectors. | ... | 22 |

SRI S. VEMAYYA:— మంత్రిగారు యిచ్చిన లెక్కలను బట్టి హరిజనులకు యిచ్చిన representation, reservation చాలా తక్కువగా వుంటున్నది. గనుక, యిప్పటికైనా వారికి సరియైన representation యివ్వటానికి, వారికి వుంటున్న కొరతను పూర్తిచేయడానికి ప్రభుత్వము పూనుకుంటుందా?

THE HON. SRI D. SANJIVAYYA:— ఉదహరణకు Senior Inspectors ఉన్నారనుకోండి. వారికి promotion యిచ్చేటప్పుడు reservation అనేది ఏమీ వుండదు. Direct recruit చేసేటప్పుడు మాత్రమే యీ reservation అనేది వుంటుంది. కాబట్టి direct గా recruit చేసేటప్పుడు మాత్రమే యీ reservation అనేది దృష్టిలో పెట్టుకొని దాని ప్రకారము ప్రభుత్వంవారు చేస్తారు.

SRI PILLALAMARRI VENKATESWARLU:— అధ్యక్షా, వెనుకటి ప్రశ్నకు సరిగానూ complete గానూ answer చేయబడలేదు. Senior Inspectors ను గురించి చెప్పారు. ఇక Junior Inspectors ను గురించి చెప్పలేదు. దాని విషయము జవాబు చెప్పాలండి.

*(No Answer.)*

SRI S. VEMAYYA:— ప్రభుత్వమువారు direct recruitment చేసేటప్పుడైనా వారికి సరియైన representation వచ్చేటట్టుగా చూస్తారా ?

(*No Answer*).

SRI C. SUBBARAYUDU:—Scheduled Classes కు Backward Classes కు percentage of reservation కేటాయించినట్లుగా Central Bank Services విషయములోగూడా వారికి reservation ఏమైనా వున్నదా ?

THE HON. SRI D. SANJIVAYYA:— గవర్నమెంటువారికిన్ని, Central Bank వారికిన్ని ఏలాంటి సంబంధము వున్నదో నాకు తెలియదు.

*Panchayat Board Elections.*

20—

*26. Q.—SRI S. VEMAYYA:—Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state whether there is a proposal to give up the method of show of hands in Panchayat Board Elections?

THE HON. SRI A. B. NAGESWARA RAO:—The Government have since decided to abolish the system of elections to panchayats by show of hands.

పంచాయతీ బోర్డు ఎన్నికలలో చేతులు ఎత్తే పద్ధతి రద్దు చేయబడ్డది.

SRI B. SANKARAIAH:— రహస్య వోటింగు ప్రకారము పంచాయితీ బోర్డులకు ఎక్కడైనా ఎన్నికలు జరిపించారా ? లేక వాయిదా వేస్తూ వస్తున్నారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO:— ప్రస్తుతము రహస్య వోటింగు పద్ధతినే ఎన్నికలు జరుపబడుతున్నవి.

SRI P. SUNDARAYYA:—రహస్య వోటింగు అంటే, ballot paper లో మార్కు చేయడమా, లేక రంగు పెట్టెలతో ఓటింగు సాగించడమా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO:—Secret balloting పద్ధతిలోనే జరుగుతున్నది.

SRI P. SUNDARAYYA:—Secret balloting అంటే, ఓటర్లయొక్క నెంబరు తీసుకొని, బాలటు పేపరు మీద మార్కు చేయడ మనే సంగతి మాకు తెలుసును. ఈ ఓటింగు రంగు పెట్టెలద్వారా జరుగు తున్నదా, లేకపోతే బ్యాలెటు కాగితముమీద మార్కు చేయడం ద్వారా జరుగుతున్నదా ? అని నా ప్రశ్న.

THE HON. SRI A. B. NAGESWARA RAO:— వేరే ప్రశ్న వేయించండి.

SRI P. SUNDARAYYA:—అధ్యక్షా, నేను అడిగిన ప్రశ్నకు మంత్రిగారు సరిగా సమాధానం యివ్వలేదు. నేను వేసిన supplementary question అది గూడా యీ ప్రశ్నకు సంబంధించినదే గనుక దీనికి వేరే ప్రశ్న వేయమని అడగడము సరికాదు. వేరే ప్రశ్న అవసరమూలేదు. రహస్య బ్యాలటు పద్ధతిన ఎన్నికలు జరుపుతున్నవని మంత్రిగారు శెలవు యిచ్చినప్పుడు, అది రంగు పెట్టెలద్వారా జరిగే పద్ధతిన జరుపుతున్నారా, లేకపోతే మార్కు చేసే పద్ధతిన జరుపుతున్నారా అని అడిగాను. ఇది supplementary question కాబట్టి దీనికి మంత్రి గారు జవాబు యివ్వవలసి వున్నదని అంటున్నాను.

THE HON. SRI A. B. NAGESWARA RAO:— దయచేసి వేరే ప్రశ్నగా పంపమని కోరుతున్నాను.

SRI PRAGADA KOTAIAH:— పంచాయితీబోర్డు ఎన్నికలు రెండు సంవత్సరాలవరకు వాయిదా వేస్తున్నట్లుగా పత్రికలలో వార్త పడ్డది. ఆ సంగతి నిజమేనా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO:—నాకు తెలిసినంతమట్టుకు, అటువంటిది యేమీ లేదు.

(Sri Vavilala Gopalakrishnaiah was seen raising his hand.)

THE HON. SRI K. VENKATA RAO:—Sir, in all our experience we never noticed raising of hands to attract the attention of the Speaker's eye. It is very wrong, Sir.

*Coconut Research Station in the State.*

21—

*184. *Q.*—SRI S. VEMAYYA:—Will the Hon. the Chief Minister be pleased to state—

(*a*) whether there are proposals with the Government to start Coconut Research Station in the state now; and

(*b*) if so, when and where?

THE HON. SRI B. GOPALA REDDI:—*Clauses* (*a*) *and* (*b*).—A scheme for the establishment of a coconut research station at Ambajipet in East Godavari district has already been sanctioned. The lands required for the station have been acquired recently and the actual work on the station will be started shortly.

SRI S. VEMAYYA:— ఈ స్క్రీము అమలుపర్చడానికి ప్రభుత్వం ఎంత డబ్బు కేటాయించడానికి పూనుకుంది ?

THE HON. SRI B. GOPALA REDDI:- రెండు లక్షల రూపాయలు Lands acquire చేస్తున్నారు. ఇటీవల అపనికి ఒక Superintendent ను select చేశారు. తరువాత పనిప్రారంభిస్తారు.

*Ramapadasagar Dam.*

22—

*396. Q.—SRI P. RANGA REDDI:—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(*a*) whether the preliminary investigation of Ramapadasagar Dam is completed;

(*b*) if so, the estimated cost for completion of this Dam and the extent of acreage that can be brought under irrigation; and

(*c*) whether the Government have recommended for including this project under the First Five-Year Plan ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—

(*a*) The preliminary investigation of Ramapadasagar Dam was completed. Investigation of an alternative site for Ramapadasagar is now in progress.

(*b*) The estimated cost of the scheme already investigated by the Madras Government (Composite State) is Rs. 127·42 crores at 1948 rates.

Extent benefited under—

| | | | |
|---|---|---|---|
| Left side canal. | Ist crop. | 4.66 | Lakhs of acres. |
| | 2nd crop. | 3. 1 | Do. |
| Right side canal. | 1st crop. | 7. 2 | Do. |
| | 2nd crop. | 2. 0 | Do. |
| New second crop in Godavari Delta. | ... | 3 5 | Do |
| New second crop in Krishna Delta. | .. | 6. 4 | Do. |

(c) The Government of Madras (Composite State) recommended to the Planning Commission in 1951 for inclusion of the project in the supplementary plan but the Planning Commission did not approve this proposal.

SRI K. V. S. PADMANABHA RAJU:—అధ్యక్షా! అసలు ఈ రామపాదసాగర్ ప్రాజెక్టును గురించి, నూతన ప్రభుత్వం ఏర్పడిన తరువాత Cabinet వారు discuss చేశారా? Discuss చేసివుంటె ఏదైనా ఒక అభిప్రాయానికి వచ్చారా?

THE HON. SRI N. SANJEEVA REDDI:— ఈ మూడు నెలలలో రామపాద సాగర్ గురించి discuss చేయలేదు.

*Postponement of collection of loan instalments in dry areas.*

23—

*557-D. Q.—SRI M. R. APPA RAO (put by Sri P. Ranga Redi):—Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) whether any representations have been received from the public to postpone the loans instalments due to the Government from the ryots in dry areas; and

(b) if so, the action taken thereon?

THE HON. SRI K. CHANDRAMOULI:—

(a) Yes.

(b) Orders were issued directing that where as a result of postponement of collection of takkavi loans ordered in the previous years

more than one instalment amount of such loans has become due for recovery in the current fasli, collection shall be limited during the current fasli to one instalment only, the collection of the remaining instalments being suspended.

SRI G. YELLAMANDA REDDI:— అధ్యక్షా! ఈ తక్కావీ అప్పులలో బావులకు యిచ్చిన సబ్సిడిరికవరీలు వాయిదా వేస్తామని బావులకు అప్పులు యివ్వాలని గత ఎసెంబ్లీ సమావేశంలో మంత్రిగారు నిర్ణయించినట్లుగా statement వచ్చింది. కాని orders రాలేదు. వాటిని గురించి ప్రభుత్వం ఆలోచిస్తుందా?

THE HON. SRI K. CHANDRAMOULI:— అక్కడక్కడ dry areas లో కొన్నికొన్ని చోట్ల loans విషయంలో యింకాఇతర బాకీలు వున్నచోట్ల కష్టంగావున్నచోట్ల అనగా సామాన్యంగా రైతులు Pay చేయలేని చోట్ల కలక్టర్లకూ, తహశీల్దార్లకు liberal గా చూడవలసిందిగా Instructions యిచ్చాం.

SRI R. B. RAMAKRISHNA RAJU:— loans అంటే, subsistence loans అని కొన్ని యిచ్చారు, అవికూడా చేరుతాయా ఇందులో.

THE HON. SRI K. CHANDRAMOULI:- తక్కిన loans చేరవు.

SRI R. B. RAMAKRISHNA RAJU:- కొందరికి takkavi loans అని కరువుకాలంలో 20, 25 రూపాయల చొప్పున యిచ్చారు. వాటిని గవర్నమెంటువారు వసూలు చేయదలుచుకున్నారా?

THE HON. SRI K. CHANDRAMOULI:— అన్ని loans వసూలు చేయవలసినదే. ఐనప్పటికీ కష్టంగా వున్నచోట్ల ఆపుదల చేయమంటే, రైతులు యిబ్బంది పడుతూంటే ఆపుదల చేయడం జరుగుతుంది.

SRI R. B. RAMAKRISHNA RAJU:— loans అంటే ఏదైనా ఒక ఉపయోగకరమైన కార్యానికి యిస్తే ఆ loans వసూలు చేయవచ్చును. పాపం, తిండిలేని సమయంలో గంజి కేంద్రాలు పెట్టి, ఏదో కాస్త గంజి త్రాగమని పది రూపాయలిస్తే దాన్నికూడా loans క్రింద జమకట్టి వసూలుచేస్తే కష్టంకాదా?

THE HON. SRI K. CHANDRAMOULI:— సరేనండి, కరువు కాలంలో అప్పులు యిచ్చారు. బొత్తిగా యివ్వలేకపోతే ఆలోచిస్తాం.

SRI V. VISWESWARA RAO.— loans వాయిదా వేస్తూ పంపిన ఆర్డర్సులో ఒక తాలూకాకు ఇంకొక తాలూకాకు వ్యత్యాసం చూపరా. మెట్టతాలూకాలు, పల్లం తాలూకాలనే వ్యత్యాసం లేకుండా అన్ని తాలూకాలను ఒకే దృష్టితో చూస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI:— G.O. మాత్రం అన్నిటికీ సమానంగానే issue చేశాం.

SRI P. KODANDARAMAYYA:— గోదావరి వరద బాధితులకు యిచ్చిన loans దీనిలోకి వస్తాయా?

THE HON. SRI K. CHANDRAMOULI:— అవి తక్కావీ loans కావు.

MR. SPEAKER:—A separate question may be put.

SRI G. YELLAMANDA REDDY:—అధ్యక్షా! మంత్రిగారు కలక్టర్లకు orders పంపాము, Discretion యిచ్చాము, అన్నారు. కాని ఆచరణలోఎక్కడా ఈ orders అమలు జరగడం లేదు. Loans విషయమై చాల ఒత్తిడి చేస్తున్నారు అల్లాంటి representations వస్తున్నాయి. ఇప్పుడైనా ఖచ్చితంగా అమలు జరపడానికి గవర్నమెంటు కలక్టర్లకు తాఖీదు పంపుతారా?

THE HON. SRI K. CHANDRAMOULI:-ఎక్కడైనా అటువంటి కేసెస్ వున్నట్లయితే ప్రభుత్వం విచారిస్తుంది.

SRI PILLALAMARRI VENKATESWARLU:— తక్కావీ loans గాక dry areas లో ముఖ్యంగా dry తాలూకాలలో, ఇతర agricultural loans ఉన్నాయి. వాటిని చెల్లించలేక రైతులు బాధపడుచున్నారు. వ్యాపార పంటలకు ధరలులేక, అవి వాయిదా వేయమని మంత్రిగారికి representations పంపారు. దానిమీద action తీసుకోలేదు. ఆస్తులు వేలం వేస్తున్నారు. గవర్నమెంటు వెంటనే చర్యతీసుకొని అవి ఆపించి ఈ loans ను కూడా వాయిదా వేయుటకు చూస్తుందా?

MR. SPEAKER:—The Hon. Minister may require notice to answer the question.

SRI PILLALAMARRI VENKATESWARLU:— తెలుగులో question వేసినప్పుడు చిన్నచిన్న వాక్యాలలో వేయడంఅలవాటు. యీ ప్రశ్నపై అర్ధగంట debate అడగాలని చూస్తున్నాం.

[7th July 1955

MR. SPEAKER:—The question of takkavi loans is now before the House. There are hundred kinds of loans and they are not before the House.

SRI PILLALAMARRI VENKATESWARLU:—It does not refer to Takkavi loans. Loans mean agricultural loans also. Loans వాయిదావేస్తూ orders పంపడం urgent అర్ధగంట debate యివ్వాలి.

SRI P. VENKATASUBBAYYA:—Point of order Sir, ఉపప్రశ్నలువేసే కాలంల వుపన్యాసముచేయుటకు వీలువున్నదా ?

MR. SPEAKER:—No.

THE HON. SRI K. CHANDRAMOULI:— ఇంతవరకూ జరిగినపని మనవి చేశాను. తరువాత hard cases ఉంటే అన్నీ ఒక్కసారే postpone చేయుటకు ప్రభుత్వానికి సాధ్యంకాదు. యిది గౌరవనీయులైన సభ్యులకు తెలుసును. postponement question వచ్చినప్పుడు యివ్వగలిగినవారు, యివ్వలేనివారు అనే విచక్షణ లేకుండా వాయిదావేయడం సాధ్యపడదు. సభ్యులు యివ్వ గల్గిన వారిచేత యిప్పిస్తే, యివ్వలేనివారిని దయగా చూచుటకు వీలుంటుంది.

SRI P. SUNDARAYYA:— ఒకే రకమైన అప్పులకు ఒకే వాయిదా కడితే సరిపోతుందన్నారు. అన్నిఅప్పులు వాయిదాలమీద తీసుకొనే పద్ధతినే ఎందుచేత అవలంభించకూడదు ?

THE HON. SRI K. CHANDRAMOULI:— అన్నివ్యాధులకు ఒకేవిధమైన మందు వేయడానికి వీలులేదు.

SRI P. SUNDARAYYA:— వ్యాధి ఒకటే అయినప్పుడు ఒకే మందు వేయ్యవచ్చును కదా ?

SRI B. V. SUBBA REDDI:— రైతులు చాలా యిబ్బందులతో వున్నారు. కాబట్టి అప్పులు వాయిదా వేస్తారా ? కో-అపరేటివ్ సొసైటీలలో తీసుకొన్న అప్పులకుకూడ వాయిదా ఇస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI:— సహకార శాఖా మంత్రిగారిని అడగవలెను.

SRI VAVILALA GOPALAKRISHNIAH:— అగ్రికల్చరలు లోన్సు విషయములోకూడా వాయిదాలు యిచ్చేటట్లు చేయిస్తే ఎంతో సదుపాయంగా ఉంటుందని ఆలోచిస్తున్నాము. ప్రభుత్వము ఈ విష

యమై ఆలోచిస్తారా ? అప్పుఅంతా ఒకే పర్యాయము - యిచ్చివేయాలంటే రైతులకు చాలా కష్టంగావుంది రెండు వాయిదాలలో వసూలుకు అవకాశం కలిగిస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :— ఇది ఒకసలహా. ఆలోచిస్తాము.

SRI S. VEMAYYA :—ప్రస్తుతము తక్కావి అప్పులు outstanding arrears ఎంత వుందీ ?

THE HON. SRI K. CHANDRAMOULI :— వేరేప్రశ్న వెయ్యవలెను.

SRI K. SUBBA RAO :— సిస్తు వసూలు, రెండు కంతులు చేసినచోట్ల తక్కావి అప్పులు postpone చేస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI :— ఎక్కడైనా కష్ట సాధ్యమైన విషయాలుఉంటే వాటిని పరిశీలించి మార్పు చేస్తాము.

SRI PILLALAMARRI VENKATESWARLU :— "ముందు చెల్లించలేని వారివద్ద వసూలు వాయిదావేసి, చెల్లించేవారివద్ద వసూలు చేయడానికి ప్రయత్నం చేస్తుందా ప్రభుత్వం?

THE HON. SRI K. CHANDRAMOULI :— సామాన్యముగా అన్నికేసులు విచారిస్తాము.

SRI V. VISVESWARA RAO :— లోన్సు విషయములో వాయిదా ద్వారా వసూలు చేయటానికి పూనుకుంటుందా ప్రభుత్వం.

THE HON. SRI K. CHANDRAMOULI :— నేను యిదివరకే యీ విషయమై మనవిచేశాను. ఇంక చెప్పవలసిన అవసరం లేదు.

*Khadi Centre in Addanki of Guntur district.*

24—

*198 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) whether any representation was received by the Government from the villagers of Addanki for opening a Khadi Centre in Addanki of Guntur district; and

(b) if so, the action taken thereon ?

THE HON. SRI KALA VENKATA RAO:—

(a) Yes, Sir.

(b) The question of opening a sub-centre was considered by the Government but further action has not been pursued in view of the decision of the Government to transfer Intensive Khadi activity to the All-India Khadi and Village Industries Board.

SRI K. SUBBA RAO:—"ఖాదీ ఉత్పత్తి విషయములో యీ ప్రభుత్వానికి ఏమైనా అధికారంఉందా ? A. I. S. A. వారిమీద అధికారం చెలాయించే అధికారం యీ ప్రభుత్వానికి యేమైనావుందా ?

THE HON. SRI K. VENKATA RAO:— గౌరవ సభ్యులు తెలుసు కొనవలసిన విషయం ఏమిటంటే, ఇప్పుడు A.I.S.A. అనేదిలేదు. గవర్నమెంటు అఫ్ ఇండియా వారు A. I. K.& V. I. Board అని ఒకటి ఏర్పాటు చేశారు. మనరాష్ట్రంలో కూడా ఒకటుంది. యీరెండు కలిసి పనిచేస్తే బాగుండును. వారికి కోట్లకొద్ది పెట్టుబడి పెట్టడానికి అవకాశం వుంది. వచ్చే సంవత్సరం ఆంధ్ర దేశములో కోటి రూపాయలు ఖర్చు చెయ్యడానికి నిర్ణయించడంవల్ల ఆంధ్ర దేశములో ఖద్దరు ఉత్పత్తి బాగు పడుతుందని నా ఉద్దేశ్యము. ప్రభుత్వము అన్నిచర్యలు తీసుకొంటుంది.

SRI PRAGADA KOTAIAH:—అధ్యక్షా! రాష్ట్రంలో ఇంకా ఛాల అవసరం ఉన్నచోట్ల ఖద్దరు ఉత్పత్తి కేంద్రాలను అఖిలభారత ఖాదీ బోర్డు పెట్టడములేదు. అక్కడక్కడ సహకార సంఘాలు కావాలని చేనేత వారు ముందుకు వస్తున్నారు. యిందుకు ప్రత్యేకముగా ఒక డిప్యూటీ రిజిష్ట్రారునువేసి ఆసహకార సంఘాలస్థాపనకు ప్రభుత్వం శ్రద్ధతీసుకొంటుందా.?

THE HON. SRI K. VENKATA RAO:— సంఘాలు నిర్మాణము చేర్పడానికి ప్రభుత్వానికి అభ్యంతరములేదు. యిది వరకే అర్డర్లు వేసినాము. ప్రత్యేకముగా డిప్యూటీ రిజిష్టారును వెయ్యడానికి డబ్బు కావాలి కోటయ్యగారు రైతులవద్దనుండి పన్నులు వసూలుచేయడానికి అంగీకరిస్తే నాకు ఏమీ అభ్యంతరములేదు.

SRI P. KODANDARAMAYYA:—ఒక్క అద్దంకి గ్రామస్థులనుండేనా, యింకా యితరప్రదేశాల యెక్కడనుండైనా డిపోలు పెట్టమని ప్రభుత్వాన్ని కోరినారా?

THE HON. SRI K. VENKATA RAO:— ప్రభుత్వము కోరినచోట్ల ఏర్పాటు చేసిందని మనవిచేసినాను.

SRI P. VENKATA SUBBAYYA:— ఖద్దరు అభివృద్ధి సాగే విషయములో ప్రభుత్వ ఉద్యోగస్తులందరు ఖద్దరు ధరించవలెనని నిర్ణయం చేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO:— నిర్ణయము ఏమి అవసరములేదండి. గౌరవ సభ్యులు సహా సభ్యులందరు ఖద్దరు కట్టవలెనని లెజిస్లేటివు హాస్టలులో ప్రచారముకూడా చేస్తే బాగుంటుంది.

Sri PRAGADA KOTAIAH:—ఇప్పుడు ఖద్దరు పరిశ్రమాభి వృద్ధి విషయములో ప్రత్యేకం డిప్యూటీ రిజిస్ట్రారును నియమించాలి అన్నప్పుడు యీ గవర్నమెంటే ఆ ఖర్చు భరించవలసిన అవసరములేదు A.I.K.&V.I. బోర్డువారివద్ధ డబ్బుయున్నది. కాబట్టి యీ రాష్ట్రానికి వచ్చేకోటాడబ్బు తీసుకొని ఖద్దరు పరిశ్రమాభివృద్ధికి ప్రత్యేకశాఖను నిర్మాణముచేస్తే బాగుంటుందని సూచిస్తున్నాను.

THE HON. SRI K. VENKATA RAO:— యిది ప్రశ్నకాదు సూచనమాత్రం. సూచనలకు సమాధానం చెప్పడం అలవాటులేదు.

*Increase in Tariff Rates of Electricity.*

25—
*556 Q.—SRI R. NATHAMUNI REDDI:—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) whether any representations were made against the increased tariff rates of electricity now existing; and

(b) if so, the action taken thereon?

THE HON. SRI G. LATCHANNA:—

(a) Yes.

(b) The whole question is being reviewed carefully in the light of the representations received.

(1) అవునండి.

(2) వివిధ సంస్థలు వ్యక్తులు చేసిన, representations అన్నీకూడా జాగ్రత్తగా. సాకల్యముగా ప్రభుత్వం విచారించింది. కోర్టులో writ ఉంది కాబట్టి తగ్గింపు ప్రకటించే అవకాశములేదు".

SRI R. NATHAMUNI REDDI:—ప్రస్తుతం రైతులు పండించే ధాన్యాలకు మూడవవంతు ధరలు తగ్గిపోయినందువల్ల మద్రాసు రాష్ట్రం మైసూరు రాష్ట్రం చార్జీలు తగ్గించే ప్రయత్నం చేస్తున్నప్పుడు మనవారు నూటికి నూరుపాళ్లు ఎలక్ట్రిక్ చార్జీలు పెంపుచెయ్యడం న్యాయమా అని మంత్రిగారికి మనవిచేస్తున్నాను.

THE HON. SRI G. LATCHANNA:— ఇందాకా చెప్పిన దానిలోనే జవాబు ఉన్నదని నామనవి.

SRI B. SANKARAIAH:— ఇప్పుడు పెంచటం అన్నది యూనిట్టుకు ఎంత, మినిమము రేటుకు ఎంత పెంచారు, అన్న విషయము తెలియచేస్తారా ?

THE HON. SRI G. LATCHANNA:— ప్రాంతాలలో తేడా లేదు.

SRI R. B. RAMAKRISHNA RAJU:— గవర్నమెంటువారు రేటు ఎక్కువచేశారు ఆ విధంగా చేయకూడదని High Court లో writ వేశారు. రేట్లు చేయకూడదని మేము అడుగుతున్నాము. గవర్నమెంటు వారు ఒప్పుకొని రేట్లు తగ్గిస్తే writ లు అవసరంలేదు. కాబట్టి తగ్గించ దలచుకొన్నారా అని అడుగుచున్నాను.

THE HON. SRI G. LATCHANNA:— Writ వేసినవారు మాకు అవసరంలేదు అని చెప్పాలి. లేకపోతే కోర్టువారే కొట్టి వేయాలికాని నాకు చెప్పేఅధికారంలేదు.

SRI P. SUNDARAYYA:— Writ ఉన్నప్పుడు తమ నిర్ణయం ప్రకటించడానికి అభ్యంతరములేదు కదా.

THE HON. SRI G. LATCHANNA:— అభ్యంతరము ఉన్నది. లేనిది అన్నది ముఖ్యముకాదు.

MR. SPEAKER:—"If the matter is sub-judice, further questions shall be disallowed."

*Deputy and Assistant Commercial Tax Officers in the State.*

26—

*96 Q.—SRI S. VEMAYYA:—Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state—

(*a*) (1) the number of Deputy Commercial Tax Officers;

(2) the number of Assistant Commercial Tax Officers in the state now; and

(*b*) the number of Harijans out of clauses (1) and (2)?

THE HON. SRI D. SANJIVAYYA:—

"(*a*) (1) 63.

(2) 104.

(*b*) Under item (*a*) (1) Nil.

Under item (*a*) (2) 1."

SRI S. VEMAYYA:—Deputy Commercial Tax Officers 63 లో హరిజనులు సదారత్తు. Assistant Commercial Tax Officers గా 104 గురికి ఒకరుఉన్నారు. ఇప్పుడైనా ప్రభుత్వము వెంటనే direct recruitment చెయ్యడానికి పూనుకుంటుందా?

THE HON. SRI D. SANJIVAYYA:— ఖాళీవున్నప్పుడు తప్పకుండా రిక్రూటుచేస్తాము.

*Constitution of Panchayat Boards in villages.*

27—

*27. Q.—SRI S. VEMAYYA:—Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state—

(*a*) the number of villages in which Panchayat Boards have been so far constituted; and

(*b*) the number of villages in which the new Boards will be constituted this year?

THE HON. SRI A. B. NAGESWARA RAO: —

(*a*) 3478.

(*b*) No information is available.

(ఎ) 3478.

(బి) సమాధానము చెప్పడానికి అలవికాదు."

SRI S. VEMAYYA:— యీ సమాచారము చెప్పడానికి ఎందువల్ల సాధ్యపడదో శెలవిస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO: — పంచాయితీ బోర్డులు ఏర్పాటుచేసేవారు Inspector of Local Boards అయిన ఎంత త్వరగా ఏర్పాటుచేస్తే అంత త్వరగా అవి ఎక్కువే అవుతాయి. కాబట్టి చెప్పడానికి వీలులేదు.

SRI C. SUBBARAYUDU:— ఈ క్రొత్త పంచాయితీలు ఏర్పాటు చెసేసందర్భములో కొన్ని గ్రామాలలో సగము భాగము ఒక revenue village గా, మరి కొంత భాగము ఇంకొక revenue village గా వున్నటువంటి గ్రామాలుచాలావున్నవి. అందువల్ల ఒకే గ్రామము రెండు పంచాయితీల క్రిందకూడా వచ్చేపరిస్థితులున్నాయి. వాటిని ఒకే పంచాయితీకిచేయుటకుగాని లేక separate unit గా చేయుటానికిగానిమంత్రి గారు ఏమైనా ఆలోచిస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO: — ఆ విషయం ఆలోచించబడుతుంది.

SRI C. SUBBARAYUDU:— మంత్రిగారు సమాధానమిస్తూ "Local Board Inspector గారు ఎన్ని పంచాయితీలు ఏర్పాటుచేయ

గల్గిందీ వారిచేతులలోవుంది, అందుచేత వారు ఎన్నిచేస్తే అన్ని ఎక్కువ అవుతాయని" చెప్పారు. మంత్రిగారి అధీనములో Local Boards Inspector గారు ఉంటారని ఇంతవరకు మేము అనుకుంటూవచ్చాము, అదికాదా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO: — Local Boards Inspector గారు మంత్రిగారి అధీనములో ఉన్నారు కాని పంచాయితీ బోర్డు ఏర్పాటు చేసేసందర్భములో సంపూర్ణ అధికారము వారిచేతులలో వుంది.

SRI A. C. SUBBA REDDI:— మంత్రిగారికి తెలియకుండానే వారికి అధికారమువుండవచ్చుకాని మంత్రిగారు యిన్నిరోజులలోపల వాటినిపెట్టమని Orders pass చేసేదానికి ఎటువంటి అభ్యంతరమైనా ఉన్నదా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO: —ఏదైనా తేది ఇచ్చి ఆ తేదీలోపల ఎన్ని పంచాయితీలు ఏర్పాటుచేస్తారు అనే ప్రశ్న వేస్తే దానికి జవాబుచెప్పడానికి సావకాశం ఉంది,

SRI B. SANKARAIAH:— ఇప్పుడు పంచాయితీ బోర్డులులేని గ్రామాలలో పంచాయితీ బోర్డులు ఏర్పరచడానికి ఎంత కాలము పట్టుతుందండీ ?"

THE HON. SRI A. B. NAGESWARA RAO: — అది ప్రత్యేకముగా ఆలోచించబడుతుంది. వీలైనంత త్వరలోనే అన్నిటికి ఎన్నికలు జరుపడానికి ప్రయత్నం జరుగుతుంది.

SRI G. YELLAMANDA REDDI:— National Extension Scheme లోవున్నటువంటి తాలూకాలలోని అన్ని గ్రామాలలోనూ వెంటనే పంచాయితీ బోర్డులు ఏర్పాటుచేస్తారాండీ?

THE HON. SRI A. B. NAGESWARA RAO: — ప్రయత్నము చేస్తామని మనవిచేస్తున్నాను.

SRI G. YELLAMANDA REDDI:—National Extension Blocks లో వున్నటువంటి గ్రామాల్లో వెంటనే పంచాయితీ బోర్డులను ఏర్పాటుచేస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO: — ప్రయత్నముచేస్తాము.

SRI P. KODANDA RAMAYYA:— పోలవరం గ్రామంలో పంచాయితీ బోర్డు పెట్టమని వ్రాసిందానికి ఏమైనా విజ్ఞప్తి వచ్చిందా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO: — దయచేసి వేరే ప్రశ్న పంపిస్తే సమాధానం వస్తుంది.

SRI VAVILALA GOPALAKRISHNAIAH: — 500 జనాభాకు మించకుండా ఉన్నటువంటి గ్రామాలకు ప్రత్యేక పంచాయితీలు

ఏర్పాటు చేస్తారా? ప్రక్కన ఉన్నటువంటి గ్రామాలను కూడా కలిసి 2,000 జనాభాకు ఒక పంచాయితీని ఏర్పాటు చేయాలని ఆలోచిస్తున్నారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO: — పంచాయతీ చట్టము ప్రకారము 500 జనాభాకు పైన ఉన్న అన్ని గ్రామాలకు పంచాయతీ బోర్డులను ఏర్పాటుచేయాలని ఉంది. అందుకు ప్రయత్నం జరుగుతోంది.

SRI S. VEMAYYA:—ఒక రెవిన్యూ గ్రామములోనే 2, 3 పంచాయితీ బోర్డులు కూడా ఉండడము జరిగింది. వీటి నన్నింటినీ కూడా ఒకే పంచాయతీ క్రిందకు తీసుకురావడానికి, ఇంకా బాగా పని చేయించ డానికి ప్రభుత్వములో అలోచన ఏమైనా ఉన్నదా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO: —ఇటువంటి వాటిని గురించి ప్రత్యేకముగా ప్రశ్న పంపితే వాటిని గురించి ఆలోచించ బడుతుంది.

SRI S. NARAYANAPPA:— ఈ పంచాయితీ చట్టాన్ని అనుసరించి రెవిన్యూ ఆదాయములో 12% పంచాయితీలకు కేటాయించవలసి నట్టు ఉండి దానిని మంత్రివర్గము ఉపసంహరించినట్లు పత్రికలలో చూచినాను. అది ఎంతవరకు నిజము అటువంటి నిర్ణయము ఏమన్నా జరిగిందేమో మంత్రిగారు సెలవిస్తారా?

THE HON. SRI A. B. NAGESWARA RAO:— Act ప్రకారము Land revenue లో 8 వ వంతు యివ్వాలని ఉంది కాని 1951 లో Composite State లో ఉన్నప్పుడే ఆ section suspend చేయబడింది. ఇంకా ఇప్పుడు కూడా ఆ section suspension లోనే ఉన్నది.

SRI R. B. RAMAKRISHNA RAJU:— ఎవరు suspend చేశారండి?

THE HON. SRI A. B. NAGESWARA RAO: — Composite State లోనే జరిగిందని శెలవిచ్చాను.

SRI R. B. RAMAKRISHNA RAJU:— ఎవరు suspend చేశారండి ?

THE HON. SRI A. B. NAGESWARA RAO: — అప్పుడున్న Government.

SRI P. SUNDARAYYA:— శాసనసభ చేసిన చట్టాన్ని suspend చేయడానికి Government కు ఏమి అధికారము ఉంది ?

THE HON. SRI A. B. NAGESWARA RAO: — Composite State లో జరిగింది. ఇప్పుడు చెప్పడానికి సావకాశంలేదు. కాబట్టి వేరే ప్రశ్న పంపిస్తే సమాధానము చెప్పబడుతుంది.

*Modified Elementary Education Scheme.*

28—

*626. Q.—SRI P. GOPALAKRISHNA REDDI:— Will the Hon. the Chief Minister be pleased to state—

(a) Whether there is a proposal to suspend the modified Elementary Education Scheme now in force; and

(b) if so, when?

THE HON. SRI B. GOPALA REDDI:—The modified scheme of Elementary Education has already been withdrawn with effect from the school year 1954-55.

SRI G. YELLAMANDA REDDI:— ఈ modfied scheme ను రద్దు చేశారని చెప్పారు. అయితే Kuppuswamy Comittee చేసిన సిఫార్సులను అమలు జరుపుతున్నారా, లేక పాత మాదిరినే జరుపుతున్నారా?

THE HON. SRI B. GOPALA REDDI:—Kuppuswamy Committee నివేదికలో 80 recommendations వున్నాయి. వాటిలో 40 recommendations ను ఒప్పుకొన్నాము, కొన్నిటిని ఒప్పుకోలేదు. కొన్ని ఆలోచిస్తున్నాము. Modified scheme ను withdraw చేశాము.

SRI VAVILALA GOPALAKRISHNIAH:—Modified scheme ను మార్పు చేసేందుకొసమే Kuppuswamy Committee వేయబడింది. ఆ Committee Report యిచ్చిన తర్వాత modified scheme ఆపారు. అయితే ఇప్పుడు ఏ scheme అమలు జరుగుతోంది ?

THE HON. SRI B. GOPALA REDDI:—Modified scheme రాకముందు ఏ scheme వున్నదో అదే యిప్పుడు అమలులో వున్నది.

## II. MESSAGE FROM GOVERNOR.

MR. SPEAKER:—I have to announce to the House that the following message dated 30th April, 1955, has been received by me from the Governor of Andhra:—

"I acknowledge with many thanks your D.O. letter No. 1489/55-A.L., dated 27th April 1955, with which is enclosed a copy of the resolution passed by the Assembly thanking me

for the address I delivered on the 23rd April 1955. I am grateful to the Assembly for the motion."

[NOTE.—An asterisk (*) at the commencement of a speech indicates revision by the Member.]

### III. ADJOURNMENT MOTION RE: CLOSURE OF IV FORM CLASSES IN BOARD HIGH SCHOOLS.

MR. SPEAKER:—"Sri Vavilala Gopalakrishnaiah has given notice of the following adjournment motion:—

'This House stands adjourned to discuss about the grave situation arisen out of closing the IV Form Classes in many Board High Schools in the State.'

Now, the question of consent arises. I would like to know whether the Hon. the Leader of the House has got any statement to make on the fact contained in the motion and whether schools are closed creating a situation.

THE HON. SRI B. GOPALA REDDI:—Special Officers ఇంకా IVth form Schoolsను close చేసినట్లు report ఏమీ రాలేదు. ఇంకా యిప్పుడైనా వాగ్దానంచేసిన డబ్బుయిస్తే పాఠశాలలో IV ఫారంపెట్టడానికి Special Officers తయారుగావున్నారు. ఇప్పటికి 242 schools లోను 163 స్కూళ్ళలో IV form పెట్టినారు. ఇంకొక 34 schools లో పెడతామని కూడా Special Officers అంటున్నారు. ఇంకా 45 schools నుంచ response ఏమీ రాలేదు. ఆ 45 schools విషయంలో కూడా Special Officers కొంచెము ఉదారముగా చూచుటకు IV form పెట్టడానికి ప్రయత్నం చేస్తున్నారు. కాబట్టి close చేయవలసిన schools 5 లేక 6 మాత్రమే వుంటాయేమో. ఇప్పుడు వుండే పరిస్థితి అది. అందువల్ల పెద్ద ప్రమాదంవచ్చినదని అనుకొని యీ adjournment motion పెట్టవలసిన అగత్యము లేదని అనుకున్నాను.

MR. SPEAKER:—In view of the statement made by the Hon. the Leader of the House, I do not feel that there is any urgency about it. Further Sri Vavilala Gopalakrishnaiah will have ample opportunities to discuss this subject in the course of the budget debate. Consent is refused.

## IV. MOTION UNDER RULE 24 OF THE ASSEMBLY RULES.

THE HON. SRI B. GOPALA REDDI:—Sir, I move:

"That rule 24 of the Assembly Rules be suspended and the House do resolve to transact the official business on Thursday, the 7th July 1955."

మామూలుగా బడ్జెటు సమావేశములలో అనధికార దినాలను యివ్వడం పరిపాటి కాదు. రేపు బడ్జెట్ present చేయబడుతుంది, గనుక యిదంతా బడ్జెట్ సెషన్సు క్రిందనే లెక్క కువస్తుంది. అందువల్ల సభ్యులంతా దయచేసి కొంత ఉదారంగా ఈనాడు గవర్నమెంటు పనిచేసికోడానికి అనుమతి నివ్వ వలెనని కోరుచున్నాను.

SRI P. SUNDARAYYA:— అధ్యక్షా, దీనిని నేను వ్యతిరేకిస్తున్నాను. దీనికి కారణాలు చెప్పుతున్నాను. అనధికార సభ్యులకోసం ప్రత్యేకంగా ఒక దినాన్ని కేటాయించివుండడంవల్ల దానిని వినియోగించుటకు కొన్ని అనధికార తీర్మానాలు వేమయ్యగారు— రెండు మూడు తీర్మానాలు—పంపించడంకూడ జరిగింది. అందుచేత న్యాయంగా రూల్సుప్రకారం ఈ రోజున వచ్చిన అనధికార తీర్మానాలను చర్చించవలసియున్నది. సభానాయకులు ఇది బడ్జెట్ సమావేశము కాబట్టి బడ్జెట్‌కు సంబంధించిన విషయములు తప్ప ఇతర అనధికార విషయాలు చర్చించుటకు వీలులేదని, బడ్జెట్ సమావేశంలో అనధికార రోజు యివ్వడం సాంప్రదాయం కాదని అన్నారు. కాని మన రూల్సు అన్నీ మనము మార్చుకొనవలసియున్నది. ఇప్పుడు వున్న రూల్సు అన్నీ ఏ 1919వ సంవత్సరంలోనో 1920వ సంవత్సరంలోనో చేసినటువంటివి. ఇప్పుడు మనము 1955వ సంవత్సరంలో వుంటున్నాము. పార్లమెంటులో అనుసరిస్తున్న సాంప్రదాయాన్నిబట్టి చూచినప్పటికినిగూడ ఢిల్లీ పార్లమెంటులో గత నాలుగేళ్లుగాను అంతకు ముందు Constituent Assembly వుంటూ వచ్చిన రోజులలో కూడ, బడ్జెట్ సమావేశంలో కూడ అక్కడ వారానికి ఒక రోజు అనధికార దినముగా ప్రకటించబడుతూ వున్నది. అందుచేత మన కొత్త రాజ్యాంగ చట్టం ప్రకారం ఆ సాంప్రదాయాన్ని చూచినప్పటికీ, అనధికార తీర్మానాలకు ఒక రోజు కేటాయించవలసియున్నది. కనుక యీ రోజు బడ్జెట్ సమావేశమనే కారణంతో అనధికార దినమున అధికార తీర్మానాన్ని ప్రతిపాదించడం సరియైనది కాదు. అంతేకాకుండా యీ రోజున మనకు వున్నటువంటి అధికారాన్ని బట్టి మన పనులన్నీ నిర్వహించేందుకు ఇంకా ఒక వారం రోజులు ముందుగా శాసనసభను పిలిచియుండవచ్చును లేక యీ సమావేశమే యింకా ఒక వారము రోజులు కొనసాగించవచ్చు. అంతేకాని అనధికార దినమైన యీరోజును అధికార తీర్మానములను చర్చించుటకు మార్చుకోవడం ముఖ్యంగా తక్కువ సంఖ్యాకులుగా వున్న అనధికార సభ్యులకు వున్నటువంటి హక్కును కొంత పరిమితం చేయడం అవుతుంది. అందుచేత శాసనసభానాయకులు యిప్పటికైనా యీ తీర్మానాన్ని ఉపసంహరించుకోవలసిందని కోరుతూ యథాతథంగా రూల్సు ప్రకారం యీ రోజున

అనధికార తీర్మానాలను చర్చించడం సవ్యంగా వుంటుందని మనవి చేస్తున్నాను. ఒకవేళ ఏ కారణంచేతనైనా దీనిని అంగీకరించడానికి సాధ్యం కాకపోతే యీ సమావేశం పూర్తి అయ్యేలోపల ఏదైనా మరొక రోజును అనధికార రోజుగా తీసుకొంటామని వాగ్దానం యిచ్చినట్లయితే ఒక రకంగా మనం రాజీమార్గంగా వెళ్ళడానికి అవకాశముంటుంది.

SRI R. B. RAMAKRISHNA RAJU:—అధ్యక్షా, అనధికార తీర్మానాలు ఏవైనా వున్నాయా? Non-official business ఏముందో, ఏమిలేదో మాకేమీ తెలియదు. అజెండాలో ఏమీ లేదు. అజెండాలో చేర్చియుంటే బాగుండేది. అనధికార తీర్మానాలేవీ లేకపోతే దీనిపై చర్చ అనవసరము.

MR. SPEAKER:—I may mention for the information of the House, that there are some resolutions sent to the office, but we did not anticipate that we will have an Assembly meeting on this day. So, no ballot was taken before. As such no non-official business is ready for consideration of the House.

SRI PILLALAMARRI VENKATESWARLU:—అధ్యక్షా, ఈ అసెంబ్లీ 6 వ తేదీ సమావేశమవుతుందని చాల రోజులక్రిందటే నోటీసు పంపించారు. ఆ విషయం అందరికీ తెలిసేవుంటుంది. కనుక ఆఫీసులో ఈ అనధికారతీర్మానమును ballot చేయవలసివుండినది. ఆ విధంగా ఎందుకు చేయలేదో ఆఫీసువారు explain చేయవచ్చు. కాని ఏదైనా అత్యవసరమైన official business వుంటే యీ విధంగా కోరవచ్చు. దానినిమేము consider చేయవచ్చు. కాని ఈవేళ వచ్చినటువంటి business...

SRI R. B. RAMAKRISHNA RAJU:—On a point of order, Sir, అజెండాలో non-official business ఏదీ లేదు. Non-official business లేనప్పుడు దీనిపై చర్చ ఎందుకు జరుగుతున్నదో తెలియడం లేదు.

MR. SPEAKER:—There need not be much discussion on this.

THE HON. SRI G. LATCHANNA:—ఒక Point of order raise చేసినతరువాత దానికి సమాధానము చెప్పవలసియుంటుంది.

SRI PILLALAMARRI VENKATESWARLU:—అందుచేత ఇప్పుడు అత్యవసరమైన official business ఏదైనా వుంటే consider చేయవచ్చు. అవిధంగా కోరడంకూడ సమంజసంగా వుంటుంది. కాని ఈరోజున చేసినా ఒకటే, ఇంకో నెల రోజులకు చేసినా ఒకటే. నేను చెప్పేది opposition సభ్యుల తరఫునే కాదు. ప్రభుత్వ పక్ష సభ్యుల గురించి కూడ చెపుతున్నాను. అందువల్ల వారిని ఇప్పటికైనా ఈ తీర్మానాన్ని ఉపసంహరించుకోవలసిందని కోరుతున్నాను. మనకు అసలే non offical

days చాల తక్కువ. ఒకవేళ తప్పనిసరిగా ఈరోజు official business కు కావాలంటే ఈ session లోనే మరొక రోజు దీనికి కేటాయించవలెనని కోరుతున్నాను.

THE HON. SRI B. GOPALA REDDI:— అధ్యక్షా, ముందు 6,7 తేదీలలో planning మీద discussion జరుగుతుందని, 8 వ తేది బడ్జెటు ప్రారంభమవుతుందని అనుకొన్నాము. తరువాత planning గురించి ప్రస్తుతం చర్చించడానికన్నా కొంతకాలమైన తరువాత, దానికి సంబంధించిన విషయాలన్నీ తెలుసుకొనిన పిమ్మట చర్చిస్తే బాగుంటుందనుకొని నామట్టుకు నేను బహుశా ఈ సమావేశం 8 వ తేదీ నుంచి ప్రారంభిస్తే బాగుంటుందేమోనని అనుకొన్నాను. కాని, సభ్యులు కర్నూలుకు 6 వ తేదినే రావడానికి ఇదివరకే programme వేసుకొనివుంటారు గనుక సమావేశం postpone చేయడం బాగుండదని, మర్యాదగా వుండదని 6 వ తేదీనే సమావేశం ప్రారంభింపబడింది. ఈ పరిస్థితులలో ఇప్పుడు అనధికార business జరుగుతుందని ఆఫీసువాళ్లుగాని, మేముగాని అనుకొనివుండలేదు. ఈ సమావేశం గురువారమే అనగా, non-official day ప్రారంభమైంది. అటువంటప్పుడు ప్రారంభంలోనే యీ అనధికార తీర్మానాన్ని అధికార దినముగా మార్చడానికి సంతోషంగా లేదు. కాని, ఈ పరిస్థితులలో యీ విధంగా చేయవలసివచ్చింది. సాధారణంగా యెప్పుడైనాగాని opposition నాయకులను సంప్రదించి, వారియొక్క అనుమతితోనే యిటువంటి మార్పు చేయబడుతున్నది. కాని వారిని ఉపేక్షించి చేయడంలేదు. మద్రాసులో కూడ అదే విధంగా జరుగుతూ వచ్చింది.

తరువాత యీ బడ్జెటు సమావేశం ఆగష్టు 4, 5 తేదీవరకు వుంటుంది గవర్నరు దీనికంతా తారీఖులు నిర్ణయించారు. కనుక యీ non-official day యీ సమావేశంలో వచ్చుటకు వీలు లేదేమోననుకొంటాను. మరల సెప్టెంబరులో సమావేశం కావచ్చును. అప్పుడు యీ non-official తీర్మానాలు తీసుకోవచ్చును. అప్పుడు సావకాశంగా చర్చించుకోవచ్చును. కనుక యీ దినం యీ తీర్మానాన్ని వ్యతిరేకించకుండా దీనిని సభ్యులందరు ఉదారంగా pass చేయవలెనని కోరుతున్నాను.

MR. SPEAKER:—The question is:

"That rule 24 of the Assembly Rules be suspended and the House do resolve to transact the official business on Thursday, the 7th July 1955."

The motion was carried.

V. GOVERNMENT MOTIONS.

*(1) Constitution of the Committee of Privileges.*

THE HON. SRI B. GOPALA REDDI:—Sir, I move.

"That with reference to sub-rule (1) of Rule 156 the Madras Legislative Assembly Rules as adopted, this Assembly do proceed, on a date to be fixed by the Speaker to elect 15 members to be the members of the Committee of Privileges for the financial year 1955-56."

MR. SPEAKER:—The Hon. Member Sri Vavilala Gopalakrishnaiah has given an amendment to this motion. It is:

"To add the words 'though the Privileges Committee were not referred any subject to decide in the last five years'."

"గత 5 ఏండ్లలో వారికి ఏ matters కూడా పంపించకపోయిన" అనే మాటలు చేర్చమంటారు.

I rule the amendment out of order.

The question is:

"That with reference to sub-rule (1) of Rule 156 of the Madras Legislative Assembly Rules, as adopted, this Assembly do proceed on a date to be fixed by the Speaker to elect 15 members to be the members of the Committee of Privileges for the financial year 1955-56."

The motion was carried.

MR. SPEAKER:—In accordance with the regulations made by me for the conduct of elections according to the principle of proportional representation by means of the single transferable vote, I fix 3 p.m. on Monday, 18th July 1955 as the date on or before which notice of nomiations for election to the Committee of Privileges should reach the Secretary.

If the number of candidates nominated exceeds the number of vacancies to be filled, namely, fifteen, there will be an election, the date and time of which will be intimated later.

*(2) Constitution of the House Committee.*

THE HON. SRI B. GOPALA REDDI:—Sir, I move:

"That with reference to Rule 157 of the Madras Legislative Assembly Rules, as adopted, this Assembly do proceed, on a date to be fixed by

7th July 1955]

[SRI D. SANJIVAYYA]

కట్టవలసివస్తుంది, అంటే మన అంధ్రరాష్ట్రములో ఎన్ని మైళ్ళు బస్సులు నడుస్తాయో, అంతవరకు ఆ tax లో భాగము మనకువస్తుంది. ఇతర రాష్ట్రాలలో ఎన్ని మైళ్ళునడిస్తె అంతవరకు ఆ రాష్ట్రాలకు పోతుంది. ఇక లారీలనుగురించి మనకు, మద్రాసు రాష్ట్రమువారికి యిదివరకువున్న ఒడంబడిక ప్రకారము మనము సగము, వారు సగము తీసుకుంటున్నాము. ఇప్పుడు ఆ లారీకు permit తీసుకొని, అది మద్రాసు రాష్ట్రములో తిరుగక పోతె, అప్పుడు మనకే పూర్తిగా కట్టవలసివుంటుంది.

Sri P. SATYANARAYANA—అధ్యక్షా, శ్రీకాకుళం జిల్లాకు సరిహద్దుగా ఒరిస్సా రాష్ట్రము వున్నది. అక్కడ శ్రీకాకుళంనుంచి పర్లాకిమిడివెళ్లే బస్సులు పాత పట్టణం దగ్గర సుమారు ఎప్పుడో నాలుగు సంవత్సరాలనుంచి ఆపివేస్తున్నారు. దాన్ని గురించి ప్రభుత్వము యేమైన శ్రద్ధతీసుకుంటుందా?

THE HON. SRI D. SANJIVAYYA:- దాన్ని గురించి ప్రభుత్వము వేరే సమస్యగా పరిగణించి శ్రద్ధ తీసుకుంటున్నది. అది మాత్రము మనము మద్రాసులోవుండగానే అమలులోవున్న చట్టము ప్రకారము జరుగుచున్నది. ఈ చట్టము మద్రాసు రాష్ట్రానికి ఆంధ్రరాష్ట్రానికినీ ప్రస్తుతము మైసూరులో చేరిన ప్రాంతానికినీ అనువర్తిస్తూ వుండేది. అంధ్రరాష్ట్రము వచ్చిన తరువాత యీ చిక్కువచ్చింది. దాన్ని పరిష్కరించే నిమిత్తమే యిప్పుడు యీ రూలు తేబడింది.

SRI A. YERUKU NAIDU .— అధ్యక్షా Inter State routes విషయములో Act ను amend చేస్తున్నాము కాబట్టి అంధ్ర రాష్ట్రము యేర్పడిన ప్రత్యేక పరిస్థితులలో ఒక్క మద్రాసు, మైసూరు రాష్ట్రాలకు యీ సౌకర్యము కలిగించినప్పుడు, ఆంధ్రరాష్టానికిని ఒరిస్సా రాష్ట్రానికిని మధ్యన నడుస్తున్న మోటారు vehicles కు గూడా యీ amendment వర్తింపజేయకూడదా ? అటువంటి సవరణ ఆంధ్ర ఒరిస్సా రాష్ట్రాలకు మధ్య నడుస్తున్న vehicles కు గూడా వర్తింపజేయాలని కోరుతున్నాను.

Sri Mahaboob Ali Khan.—(Urdu)

THE HON. SRI D. SANJIVAYYA :— "ఇప్పుడు ఈ motor vehicles taxation విషయంలో సభ్యులు మాట్లాడినంతవరకు చూస్తే, వారికి ఎలాంటి సంశయాలు వున్నట్లు కన్పించలేదు. అయితే ఆంధ్ర ఒరిస్సా రాష్ట్రాలకు మధ్య నడుస్తున్న vehicles కు సంబంధించిన taxation విషయములు మాత్రము పరిష్కరించటానికి చర్య తీసుకోవలసింది ఒకటి కనబడుతున్నది. అది ప్రత్యేకమైన సమస్య. అది ఆంధ్రరాష్ట్రావతరణతో సంభవించిన సమస్యకాదు. కాబట్టి దానికి ప్రత్యేకంగా ప్రభుత్వము యింతకు పూర్వమే ఆలోచన చేస్తున్నది. దాని విషయంలోగూడా తప్పకుండా త్వరలోనే ఒక నిర్ణయానికి రాగలుగుతామని ఆశిస్తున్నాను. అంతకంటె విశేషంగా యిప్పుడు చెప్పవలసింది యేమిలేదు. అందువల్ల ప్రస్తుతానికి యిప్పుడు సభవారి యెదుట వుంచిన ఈ రూలును మాత్రము ఆమోదిస్తారని ఆశిస్తున్నాను."

MR. SPEAKER :—I now put the motion to the vote of the House.—The question is :—

"That the following draft of a rule proposed to be made by the Government of Andhra under section 4 (2) of the Madras Motor Vehicles (Taxation of Passengers and Goods) Act, 1952 (Madras Act XVI of 1952) amending the Schedule to the said Act be approved."

Then comes the long draft rule already circulated to the members. It shall be deemed to have been read.

The motion was carried.

## VIII. GOVERNMENT BILL.

IV *The Madras Proprietary Estates' Village Service and Hereditary village Offices (Andhra Amendment Bill*, 1955.

THE HON. SRI K. CHANDRAMOULI :—"Mr. Speaker, Sri, I beg to introduce the Madras Proprietary Estates Village Service and Hereditary Village Offices (Andhra Amendment) Bill, 1955 and move that the Bill be taken into consideration at once.

"ఈ బిల్లులో యిప్పుడు కోరబడిన సవరణనుగురించి దీని objects and reasons లో వివరముగా చెప్పబడియున్నది. అంటె యిదివరకు గ్రామోద్యోగస్థులు యేదైనా తప్పుచేసినప్పుడుగాని, ధనం అపహరించినప్పుడుగాని, వారిని

[SRI K. CHANDRAMOULI]

ముందు విచారణచేసి, అటుతరువాతనే వారిని అవసరమైతే suspension లో పెట్టడమనేది జరుగుచున్నది. అది ఇదివరకు వున్నపద్ధతి. ఇందుకు బదులు అట్టి విచారణ జరుపకముందే, తప్పు చేశాడని, ధనం అపహరించాడని ఆధారాలు కనబడితే ముందుగానే వారిని suspension లో పెట్టి, అటుతరువాత విచారణ జరిపే విధంగా రూలు మార్చటానికి, విచారణ జరిపి, విచారణలో తప్పు రుజువైనప్పుడు తగిన చర్య తీసుకోటానికి అవకాశము కలిగించటానికి యిప్పుడు యిది అవసరమైనందున యీ సవరణ తేబడింది. పైగా యింతవరకు సంపాదించిన అనుభవములవల్ల ఈ విధంగా మార్చటానికి అవకాశము కలిగింది. అందువల్ల ఈ చిన్న సవరణ ఆమోదించవలసిందిగా సభవారిని కోరుచున్నాను.

MR. SPEAKER:—Motion moved—

"That the Madras Proprietary Estates' Village Service and Hereditary Village Offices (Andhra Amendment) Bill, 1955 be taken into consideration at once."

SRI PILLALAMARRI VENKATESWARLU:-"అధ్యక్షా, ఈ బిల్లు చాలా simple గాను, ఇందులో ఏమిలేనట్లుగాను, మంత్రిగారు present చేస్తున్నారు. ఇది వాస్తవముగా అంతేనా అనేది పరిశీలించవలసి యున్నది. కారణము ఇప్పుడు యిందులోని విషయము యేమిటంటే గ్రామోద్యోగస్థులు తప్పుచేస్తే, ముందుగా action తీసుకోవటం తరువాత విచారణ చేయడం. కాని యింతవరకు జరుగుతున్నది యేమిటంటే గ్రామోద్యోగస్థులు తప్పుచేశారని ముందు విచారణ జరుపడము, అటుతరువాత వారు చేసినారని ఋజువు అయితే వారిపై suspension గాని లేక మరొక action గాని తీసుకోవడం జరుగుచున్నది. కాని యిదే సూత్రము యితర డిపార్టుమెంట్లకు, ముఖ్యంగా సంజీవరెడ్డిగారి పోలీసుశాఖకు అనువర్తింపజేస్తూ, అంటే, ఒక Sub Inspector గాని, Circle Inspector గాని తప్పుచేస్తే వారిని ముందుగా suspension గాని dismiss గాని చేసి, తరువాత వారిమీద action తీసుకుంటే (Interruption.")

THE HON. SRI N. SANJEEVA REDDI:— "ఈ procedure అందరికి వుండి, యీ గ్రామోద్యోగస్థులకు లేకపోయినందువల్లనే, ఈ బిల్లును తేవటానికి కారణమయింది. గ్రామోద్యోగస్థులమీద charge వస్తూనే, వారిని ముందు suspend చేసి తరువాత enquiry చేయటానికి యిప్పుడు సవరణ తేబడింది. అటువంటి possibility అక్కడలేదు. ఇప్పుడు తెచ్చుకొంటున్నాము."

SRI PILLALAMARRI VENKATESWARLU :—'తప్పు చేసిన ఉద్యోగిని ముందు suspend చేసి తరువాత Inquiry సాగిస్తామని అంటున్నారు. కాని ఇంతవరకు ఈ మాదిరి జరుగలేదు గనుక అది అందరికీ తెలియదు. (Interruption) అవసరమైనప్పుడు (వీలుతప్పినప్పుడు.)

''అందువల్ల అది యెట్లా వున్నప్పటికిగూడా ప్రభుత్వమువారు యిప్పుడు యేదో చేయబోతున్నాము అంటున్నారు గనుక, కనీసము ఆ అవకాశం వుందని పోలీసుశాఖ మంత్రిగారు చెబుతున్నారు. అదిసరే కాని, ఈ బిల్లు మన దేశములో వున్న చిన్న ఉద్యోగస్థులకు సంబంధించినది. కాని అదే సూత్రము అందరికి వర్తింపజేయడము అవసరమేనా, అనే విషయాన్ని మనము అలోచించవలసిన అవసరము వున్నదని అనుకుంటున్నాను. అది కాకపోయినా, తప్పుచేసిననూ, వారిని అందులోనేవుంచి ముందుగానే విచారణ జరిపి, ఆటుతరువాత action తీసుకుంటేగూడా పెద్ద ప్రమాదము యేమీవుండదు. మరొక విషయము చెబుతాను. ఇప్పుడు ఈ బిల్లు విషయములో అనేక విషయాలు అలోచించవలసిన అవసరము వున్నది. ఈ గ్రామద్యోగస్థుల సంఘాలుగూడ మనము చూస్తున్నాము. అటువంటప్పుడు మనము ప్రాథమిక trade union rights ను గూడ మనము దృష్టిలో పెట్టుకొనవలసిన అవసరము వున్నది. అదేమిటంటే, తప్పు చేశారని ముందేactionతీసుకొని, తరువాత విచారణ చేయడం ఏ trade union గూడా అంగీకరించదు. అందువల్ల ముఖ్యంగా చూడవలసింది యేమిటంటే ఈ వుద్యోగి తప్పుచేశాడు, ఆ తప్పు ఋజువు అయింది అనేదానికి ఆధారాలు వుంటే, అప్పుడు అతనిమీద సరియైన action తీసుకోవచ్చు.

అది యేమీలేకుండా ముందు ఊహించుకుని తప్పు చేశాడని report వచ్చింది అనుకోండి — ఈనాడు మన గ్రామాలలో యున్న పరిస్థితులు మన దేశంలో యున్న పరిస్థితులు అందరికి తెలుసును — పరిస్థితులు సమన్వయపఱచుకొని, అనుకూలంగా వుండేటట్లు చెయ్యాలి. ఊరికే ఏమీ చేయందే చేశారని గోపాలరెడ్డిగార్కి, మెమోరాండం కట్టలు వస్తూవుంటాయి. అందువల్ల effect కాకుండా మామూలు పరిస్థితులలో తప్పుచేశాడని అధారం వుండి ఋజువైన తరువాత action తీసుకోవడం సవ్యంగా కనిపిస్తుంది. పోలీసువారిలో చిన్న చిన్న వుద్యోగస్థులకు కూడా ఇట్లా చేస్తున్నారు కాబోలును. అందువల్ల మేము దీన్ని బలపరచలేక పోతూయున్నాము. ఈ బిల్లు లేనందువల్ల చర్య తీసుకొనడానికి ఇబ్బంది కల్గుతోందని మంత్రిగారు చెప్పలేదు. ఇది పెద్ద అవసరం వున్నప్పుడు తయారుచేసిన బిల్లుక్రింద కనిపిస్తోంది, కాని నిజంగా అవసరమైన బిల్లుగా కనిపించడంలేదు. ఈ amendment ను గురించి ఇప్పుడు నేను అడిగేది ఒకటే. 1937 వ సంవత్సరంనుంచి ప్రభుత్వంలో అనుభవం గలిగి మంత్రిత్వంలోయున్న గోపాలరెడ్డి గార్కి ఇలేనందువల్ల ఏ విధంగా administration లో ఇబ్బందులు కల్గుతున్నాయి?''

THE HON. SRI N. SANJEEVA REDDI :— "చూస్తూనే వున్నారండి. Illegal గా suspensions జరుగుతున్నాయి కాబట్టి దాన్ని legalised గా జరుపుతాము ఇకమీదటనుంచి".

SRI PILLALAMARRI VENKATESWARLU :—"ఒక విషయం మాత్రం గ్యారంటీ యిస్తాం, మంత్రి వర్గానికీ, కాంగ్రెసు పార్టీకి కూడా ఖణ్ణంగా తెలిసేటట్లు చెప్పాలి. ఉపముఖ్యమంత్రిగారు బైటపడ్డారు. చట్టబద్ధంగా చేయలేని పనులు ఇదివరకు గవర్నమెంటు చేస్తోంది. దాన్ని legalise చేయడానికి ఈ బిల్లని చెప్పారు. ఋజువైన తరువాత action తీసుకోవడం కష్టం కాదు. Serious mistakes ఉంటే విచారణ చేసి you can take action in two days. Action తీసుకోడానికి ఎంతో కాలం కావాలా? ఈ రోజున ఈ బిల్లు అత్యవసరమని మేమనుకోవడంలేదు."

SRI PRAGADA KOTAIAH :—"అధ్యక్షా ! నేను ఈ బిల్లును బలపరుస్తున్నాను. పాపం మన వెంకటేశ్వర్లుగారు అవసరంకొద్దీ చాలా యుక్తివాదం చేశారు, అయన చెప్పినదానిలో అంతకంటె అదనంగా ఏమీ కనిపించడంలేదు. ముఖ్యంగా ఈ గ్రామాధికార్లు ఈ భూముల వ్యాపారంలో, తరువాత శిస్తువసూళ్లు తదితర వ్యవహారంలో అనేక లోపాలు సర్వసాధారణంగా చేస్తున్నారు. ఈ లోపాలను అరికట్టడం అక్కడ వున్న డిప్యూటీ తహశీల్దార్లకు కాని లేదా తహశీల్దార్లకు గాని చివరకు R. D. O. లకు కూడా సాధ్యం కావడంలేదు. అల్లాంటి సందర్భంలో మాత్రమేగాక ప్రభుత్వానికి చెల్లించవలసిన డబ్బుచెల్లించడంలో పెద్ద పెద్ద లోపాలు జరిగినప్పుడు విచారణజరిగి, తప్పు నిర్ధారణ అయినతరువాత అప్పుడు suspensionచేస్తాం, లేదా వుద్యోగంనుంచి పంపివేస్తామంటే విచారణకూడా సాధ్యంకాదు. అసలు విచారణకు ముందే suspension చేయకపోతే, ఆయన మునసబుగా, కరణంగా వున్నంతకాలం, ఆయనచేతులోయున్న పుస్తకాలు ఇతరులు చూడడానికి సావకాశంలేకుండా వాయిదావేస్తూ యుండవచ్చును. ప్రభుత్వానికి రావలసిన అంత ఆదాయం బాధ్యతాయుతంగా రాబట్టుటకు మునసబుకాని, కరణంకాని లోపంచేస్తే, తప్పనిసరిగా ముందుగా suspension చేయవలసిందే. విచారణ జరిపి అవసరమైన చర్య తీసుకోవాలి. సాధారణ పరిస్థితులలో ఈ కరణాన్ని తీసెయ్యండి, ఆ మునసబును తీసెయ్యండని చెప్పేవారే యిప్పుడు ఈ బిల్లును వ్యతిరేకించడంలో అర్థము లేదు. నిజానికి వారుకూడా ఈ బిల్లు మనస్సులో సమర్థిస్తున్నారనే నేననుకుంటున్నాను.

SRI B. SANKARAIAH :—"అధ్యక్షా,ఈబిల్లు తీసుకురావడంలో గ్రామోద్యోగస్థుల విషయంలో లోపం ఎక్కడ జరుగుచున్నదో, అక్కడఅది అరికట్టుటకు ఈ బిల్లు ఏ మాత్రం పనికిరాదని మనవి చేస్తున్నాను. ఎందుకంటే అనేక విషయాలలో ప్రభుత్వం ఇచ్చిన orders అమలు జరగకుండా వుంటున్నాయి. ఎందుకు అమలు జరగడం లేదోకూడ విచారించాలి.

[SRI B. SANKARAIAH]

ఉదాహరణకు తీసుకుంటే మొన్నమొన్ననే ఓటర్లను చేర్చుతున్నారు. చచ్చిపోయిన వారిపేర్లు బ్రతికియున్నట్లు వ్రాశారు. బ్రతికియున్నవారి పేర్లు చచ్చిపోయినట్లు చూపించి తీసివేశారు. బ్రతికియున్నవారిని, 21 ఏండ్లు దాటిన వారిని ఓటర్ల list లో చేర్చుకోమంటే నిరాకరించారు. 21 వ తేదీ వఱకూ appeal time యిచ్చారు. నిరాకరించిన వాటిలో ఎన్ని కేసులలో మరల చేర్చుకోవలసి వచ్చింది? అనేక గ్రామాలలో కలరా, పశువుల జబ్బులు వస్తాయి. అనేకమంది ప్రజలు, పశువులు close అయిపోయినా మునసబు కరణాలు report చేయరు. ఈ విధంగా ఒక లక్ష కారణాలు చూపిస్తున్నాం. ఈ పక్షం నుంచి ఎప్పుడైనా భూస్వాములనేటప్పటికీ లేస్తారు, కాంగ్రెసుపార్టీ మీద కోపంచేత అంటున్నామని. పరిపాలన సక్రమంగా జరగాలంటే మునసబులకు, ఇతర గ్రామోద్యోగులకు heriditary ఉద్యోగాలుండడం పెద్ద ప్రతిబంధకంగాయుంది. ఏ గ్రామంలోచూచినా పెద్దపెద్ద భూస్వాములకు పదవులు అంటకట్టడంవల్ల ఏమీ పని జరగడంలేదు. నెల్లూరు జిల్లాలో మోపూరు గ్రామంలో రేబాల వాళ్ళున్నారు. శిస్తు కట్టుటకు లెక్క చెప్పమంటే, పదిసార్లు తిరిగినా చెప్పరు. ఒకసారి కోటిరెడ్డిగారిక్కి petition యిచ్చాం. తహశీల్దారు, కలెక్టరు recommend చేసి పంపారు మునసబుగారు లెక్క చెప్పమంటే చెప్పరు. ఈ విధంగా ఇబ్బంది పెడుతున్నారు. Heriditary rights తీసి వెయ్యాలని చెబుతున్నాం. ఎందుకు తీసి వెయ్యాలోకూడా చెబుతున్నాం. 1894–95 చట్టానికి ఈ రోజు సవరణ పెడుతున్నారు. ఎందుకు? 1894 లో బ్రిటిష్ పరిపాలన వున్నది. సంజీవరెడ్డిగారు చెప్పనే చెప్పారు. ఇప్పుడీ సవరణ లేకపోయినా, suspend చేస్తున్నారు. Suspend చేయడంవల్ల పరిపాలన సరిగా జరుగుతుందా? Heriditary హక్కు వుండడంవల్ల ఇష్టంవచ్చినట్లు చేస్తున్నారు. భూస్వాములు administration సాగనివ్వకుండా చేస్తున్నారు. వారికి ఈ పరిపాలనలో influence లేకుండా చేయుటకు వారికి ఈ eriditary rights తీసి వెయ్యాలి. ఆ ఆశయం ఈ బిల్లు ద్వారా నెరవేరితే సంతోషించేవాళ్ళం. ప్రగడ కోటయ్యగారు చెప్పారు మాకు యిష్టమేనని. గ్రామాలలో పరిపాలన సక్రమంగా జరపడం సంపూర్ణంగా యిష్టమైతే, దానికి ఈబిల్లు పనికివస్తుందా లేదా అనేది ప్రశ్న. ఆంధ్రరాష్ట్రంలో ప్రకాశంగారి ప్రభుత్వంలో బంజర్లకు నెంబర్లు యివ్వమని చెప్పారు. ఎన్నిగ్రామాలలో ఎంతమంది కరణాలు డబ్బుతీసుకోకుండా, నెంబర్లు యిచ్చారు? ప్రభుత్వ order ఒక్కటైనా అమలు జరగకుండావుంది. భద్రాచలం area లో సంవత్సరానికి మునసబుకు 30 రూపాయలు యిస్తున్నారు. సంవత్సరానికి 30 రూపాయల జీతం యిస్తున్నారు అంటే నెలకు రూ 2-8-0 లు అన్నమాట. ఇంత తక్కువ జీతాలు యిస్తుంటే, వారు ఏవిధముగా బ్రతకాలి? ప్రజలను పీడించుకొనమని

[SRI B. SANKARAIAH]

చెప్పడం అన్నమాట. ఈ విధముగా వీరు గ్రామానికి ఒక చక్రవర్తిలాగ వున్నారు. ఇవి ప్రజాసామ్యం రోజులు అంటున్నారు. ఇప్పుడు గ్రామాలలో పంచాయతీ బోర్డులు వున్నవి వాటికి గుమాస్తా వున్నాడు. కాబట్టి వాటికి యీపనులన్నియిస్తే చాలాబాగుంటుంది. పంచాయతీ బోర్డులకు ఎందుకు యీ అధికారాలు యివ్వరాదు? ఆ విధముగా చేస్తే ఎప్పటికప్పుడు వీరికి చెక్ చెయ్యడానికి వీలుంటుంది. ప్రజలకుకూడా అవకాశంవుంటుంది. అందువల్ల సమగ్రమైన శాసనము తీసుకొని రావలెనని మా ఉద్దేశము. Heriditary రైటును తక్షణం తొలగించవలెనని మేము అంటున్నాము. అట్లు తొలగించక పోతే తప్పు చేసినా, డిసిమిస్ అయినా అయన కొడుకుకే తిరిగి ఆ వుద్యోగం యిస్తారులే అని లెక్క చేయరు. డబ్బు తీనేసినా ఏదో ఒక విధముగా action లేకుండా చేసుకుంటున్నారు కాబట్టి త్వరలో సమగ్రమైన శాసనంచెయ్యాలని కోరుతూ నేను విరమించుచున్నాను.

SRI G. BAPAIAH:— "అధ్యక్షా, ఇప్పుడు గ్రామ ఉద్యోగస్థుల గురించిఅత్యల్పంగా మాట్లాడారు అని నేను అనుకుంటున్నాను. గ్రామ ఉద్యోగస్థులకు వుండేకష్టాలు వారికి సక్రమముగా తెలియవు బిల్లును గురించి మాట్లాడుతాను. బిల్లు ఏమిటంటే నేరము చేసినవారిని వెంటనే సస్పెండు చేసి విచారణ చెయ్యాలి అన్నది. నేరము అంటూ తెలిస్తే విచారణ అనేది మరొకటి ఎందుకు? సస్పెన్షనులో పెట్టవచ్చును. ఎప్పుడైతే అధికార్లకు సంపూర్ణముగా నేరము చేసినాడని తెలిసిందో తరువాత విచారణ చెయ్యడం న్యాయంకాదు. కూనికేసులు, మర్డరు, రయిటింగు కేసులలో కూడా ముద్దాయిలకు జామీను యిస్తున్నారు. అటువంటప్పుడు వీరిని సస్పెన్షనులో ఎందుకు పెట్టవలెను? గ్రామ ఉద్యోగి అక్కౌంట్సు వ్రాస్తూ వుంటాడు. అయనకు సరియైనను అయన పిటీషను పెడితే మునసబును గాని, కరణాన్నిగాని, సస్పెన్షనులో పెడితే వారి వద్దనున్న ఎక్కౌంటులు ఏ విధముగా తెలుస్తవి? పిటీషను వెళ్లగానే రెవెన్యూ ఇన్స్పెక్టరుగారు, తాహశీల్దారుగారు విచారణచేసి డిప్యూటీ కలెక్టరుకు రిపోర్టు పంపిస్తే అయన సస్పెషనులో పెడతారు. రెండు రోజులలో విచారణ చెయ్యవచ్చును. డిప్యూటీ కలెక్టరుగారే విచారణచేసి సస్పెన్షను చేయవలెనని నేను కోరుచున్నాను.

"కొంతమంది మిత్రులు నెంబర్లు యివ్వడం లేదని అన్నారు. గ్రామోద్యోగులకు వున్న కష్టాలు వారికి వున్నాయి అని నేను చెప్పుచున్నాను.

హెరిడిటరి అన్నది తీసివెయ్యాలని నేను కోరుచున్నాను. నేను ఉద్యోగము పోవలెనని అనుకున్నా నా కుమారుడికి యిస్తారు. తరువాత నా మనుమడికి యిస్తారు. వాడు ఎప్పుడైనా జెయిలుకు పోతాడేమో అనే భయం వుంది కాబట్టి యీ హెరిడిటరీ హక్కు పోవాలని నేను కోరుచున్నాను.

గ్రామ ఉద్యోగస్థుల బాధలు చెప్పలేనివి. బి.ఏ., చదువుకొన్నను యిది వదలడం లేదు. S. S. L. C. చదువుకొని విలేజి లెవెల్ వర్కరుగా వెళ్లినా మంచిదని నేను వూహించుచున్నాను."

SRI B. APPA RAO :- అధ్యక్షా! రెవెన్యూ మంత్రిగారు యిచ్చినటువంటి ఎమెండుమెంటును సపోర్టుచేస్తూ మాట్లాడుతున్నాను. న్యాయముగా పనిష్మెంటు యివ్వాలని నేను కోరుచున్నాను. కారణము ఏమిటంటే ఇదివరకటికంటే ఇప్పుడు ఎస్టేట్సు ఎబాలిషను అయిన తరువాత గవర్నమెంటు శిస్తు ఎక్కువ అయినది. ఇదివరకు ఎస్టేట్సు వున్నప్పుడు వారిసముద్దార్లు వుండేవారు. అప్పటిలో గ్రామ మునసబుకు ఆరు రూపాయలు జీతము యిచ్చేవారు. ఇప్పుడు గవర్నమెంటువారు జీతాలు ఎక్కువ యిస్తున్నారు. అలాగే యిప్పుడు నేరాలు ఎక్కువ అగుచున్నవి. ఎస్టేటుగ్రామాలలో విలేజి మునసబులు సర్కారు డబ్బును వారి స్వంతడబ్బులాగ ఖర్చుచేస్తున్నారు. చాలా మందిమీద రిపోర్టులు ఉన్నవి. అంతేకాదు. ఇదివరకు మన ప్రభుత్వం వారు ప్రొహిబిషను పెట్టారు. వారి ప్రోత్సాహమువల్లనే నేరములు ఎక్కువ అయినవి. ప్రొహిబిషను విఫలమైనది. తప్పకుండా ఈ బిల్లు ప్యాసుచెయ్యవలెనని కోరుచున్నాను.

SRI R. B. RAMAKRISHNA RAJU.— "On a point of information, Sir, ఇప్పుడు Proprietors లేనే లేరు. Proprietary villages లేనే లేవు. వారందరు కూడా గవర్నమెంటు ఉద్యోగస్థులైనారు. కాబట్టి ఇది ఎందుకు వచ్చింది? గవర్నమెంటువారికి, వీరికీ వున్న సంబంధము వేరు.

MR. SPEAKER :—"There are still some inam villages where there are proprietors."

SRI G. YELLAMANDA REDDY :—అధ్యక్షా! ఈ బిల్లును వ్యతిరేకించడంలో వుద్దేశం యేమిటని చాలామంది అనుకోవచ్చును. విలేజి మునసబులమీద కంప్లైంట్లు చేస్తున్నప్పుడు యెందుకు బలపరచకుండ వ్యతిరేకిస్తున్నారు అని అనవచ్చును. ఈ విషయంలో అసలు మా పార్టీ అభిప్రాయం యేమిటో చెప్పతాను. దీనిలో ప్రధానమైన బలహీనత ఒకటివుంది. అది తెలుసుకొనకుండానే mechanical గా ఆలోచిస్తున్నారు. ఒకర్ని suspend చేసే సమస్య ముఖ్యంకాదు. ఒకటి రెండు ఉదాహరణలు చెప్పతాను. ప్రభుత్వం యేది అయినా చట్టంచేస్తే అది భగ్నంకావడానికి చూస్తూవుంటారు యీ Village Munsifsh విలేజి కరణాలు. ఇది 100 కి 100 పాళ్లు రుజువు పరచగలను. ప్లానింగులో గాని యితర విషయాల్లో గాని తీసుకొనండి. ప్లానింగు విషయంల్లో విలేజి మునసబు కూడా ఒక మెంబరు. ఆయనకు ఒక established hereditary right వున్నది. గ్రామములో B. A., లు

[SRI G. YELLAMANDA REDDI]

కూడా V. M. కు సలాం చేయవలసిందే. ప్లానింగులో ఎన్ని కోళ్లు కావల యును అంటే విలేజి మునసబు చెప్పవలయును. హరిజనులకు బావి అంటే అయనే చెప్పవలెను. ఈవిధంగా అయనకు యెంతో influence వుంది.

గ్రామాలలోవున్న పలుకుబడితో వైరు పుల్లింగు కూడా చేయగలడు. గ్రామాలలో మునసబులు డబ్బు వసూలుచేసి తినేవారు కూడా వున్నారు. అనేక సందర్భాలలో వసూలు చేసిన డబ్బుకు రశీదులు కూడా యివ్వడం లేదు. సస్పెన్షన్ చేయవలసిన పరిస్థితులలో గూడా Deputy Collector వద్ద రెకమెండేషన్ తీసుకొనివచ్చి cancel చేయించుకొనుచున్నారు.

"నోరులేని V. M. లు వున్నారు. వారిమీద యీబిల్లు పడుతుంది కాబట్టి యీ బిల్లును వ్యతిరేకిస్తున్నాము. మనకు పనులు సక్రమముగా జరుగ వలయునంటే ప్రస్తుతం వుండే విలేజి system లో మార్పులు తీసుకొని రావలయును. ముఖ్యంగా ఒకటవ పాయింటు యేమిటనగా యీ హెరిడిటరీ రైటును బ్రేకు చేయవలయును. వారికి జీతాలు యెక్కువ చేయవలెను. మా వెంకటగిరి యెస్టేటులో జీతాలు లేవు. కలవాసం తీసుకొని బ్రతకాలి అంటే ప్రజలవద్ద మునసబులు, కరణాలు మామూళ్ళు పుచ్చుకొనవలయును. శిస్తులు వసూలు కావలయునంటే మునసబులు, కరణాలు కలసి పనిచేయ వలెను. మొత్తముమీద గ్రామములలో మునసబులు, కరణాలు dominant force గా యున్నారు. కాబట్టి యీ system మార్పు చేస్తేనేతప్ప మన సిద్ధాంతాలు అమలు జరుగవు. యుక్తి వాదము మీద పనులు జరుగుతూ వున్నవని చెప్పవచ్చును, ఉదాహరణకు రేషనింగు, ప్రొక్యూరుమెంటు ఫుడ్ కమిటిల విషయాలలో ఆశించిన పనులు యేవీ జరుగలేదు. సమగ్రమైన మార్పు తీసుకొని రావలెను. గ్రామ పరిపాలన సక్రమముగా జరుగడానికి యిదే మార్గమని మా పార్టీ అభిప్రాయం. అందుచేతనే మేము యీ అమెం డింగు బిల్లును వ్యతిరేకిస్తున్నాము, అంతే కాని మునసబులను సస్పెండు చేయడానికి మా పార్టీ వ్యతిరేకంకాదు.

SRI P. RAJAGOPAL NAIDU:—"అధ్యక్షా, ప్రతి పక్షము వారు ఒక సమస్యకు మరొక సమస్య ముడిపెడుతూన్నారు. కాంగ్రెసు పార్టీ యేమి చెప్పితే దానికి వ్యతిరేకంగా మాట్లాడడం వారి దృష్టిలో హెచ్చుగా యున్నది. గ్రామ ఉద్యోగులు యెక్కువగా అక్రమాలు చేస్తున్నారని మాకంటే వారే హెచ్చుగాచెప్పుతున్నారు. వాటిని యే విధముగా అదుపులో పెట్టవల యును అనేసమస్యవచ్చినప్పుడు సవరణను వ్యతిరేకిస్తున్నాము అన్నారు. అంటే ఏమిటి ప్రస్తుతంవున్నది, వుండాలి అన్నమాట. సవరణ వీగిపోతే అదృష్టవశాత్తు వారికి బలంలేదు. ఈ సవరణ వీగిపోతే నేరముచేసిన వారిని విచారణచేసి, దండించాలి అనే సిద్ధాంతము వుంటుంది. అది

[SRI P. RAJAGOPAL NAIDU]

మంచిదా? కాదు అని నేను చెప్పుతున్నాను. అలాగచేస్తే శ్రీ ప్రగడ కోటయ్యగారు చెప్పినట్లు రికార్డులు దాచడానికి వీలువుంటుంది. విచారణ జరుపడానికి వీలువుండదు. ప్రస్తుతంవున్న పరిస్థితిలో భేధమేమిటో వారు చూడవలయును. నేరము ఆరోపంపబడినపుడు సస్పెండు చేయకుండా విచారణ చేయవలెనా, లేక సస్పెండుచేసి విచారణ చేయవలయునా అన్నదే ప్రశ్న. వివిధంగాచేస్తే యీ గ్రామోద్యోగస్థుల్ని అదుపులో పెట్టవచ్చును, గ్రామోద్యోగస్థులచేత సక్రమంగా పని చేయించవచ్చు అనేదే ప్రస్తుత సమస్య. ముందుగా సస్పెండు చేయడమే మెరుగుగావుంటుంది అని నాఅభిప్రాయం. ఈ యిసుమును తీసివేయవలయును, హెచ్చు జీతాలు యివ్వవలెను అనే సమస్య దీనికి ముడిపెట్టడం అనవసరం. అది ప్రత్యేక సమస్య. వీటికి సంబంధించి యెక్కువ చర్చలు సాగించడం యిప్పుడు అవసరంలేదు. కాబట్టి యిప్పుడున్న ప్రధానమైన సమస్యను బలపరుస్తూ యింకా యే విధముగా వుంటే మంచిదో వారుచెప్పవలయును. వారుకూడా యీ సవరణను బలపరచవలయునని కోరుచున్నాను.'

*SRI S. K. V. KRISHNAVATHARAM:—"ఈ సవరణను నేను బలపరస్తూన్నాను. దీనితోబాటు రెవిన్యూ మంత్రిగారిని యీసవరణ తీసుకొని వచ్చినందులకు అభినందిస్తూ వున్నాను. ప్రస్తుతములో గ్రామోద్యోగులు ప్రభుత్వ ద్రవ్యం విషయములో చాలాయెక్కువగా దుర్వినియోగం చేస్తున్నారు. ఎక్కడచూచినా వేలకువేలు ప్రభుత్వ ద్రవ్యం దుర్వినియోగం చేసినందులకు Criminal Breach of trust క్రింద prosecute చేయబడడం కోర్టులో చాలా యెక్కువగావుంది. స్వల్పమొత్తాలు కాకుండ 60 వేల పైచిలుకు మొత్తాలు చాలామంది Village Munsif లు యీద్రవ్యాపహరణం చేయడం అనేది నాకుతెలుసును. ఏ మాత్రము వారికి ఆస్తులులేవు. వారివద్దనుంచి డబ్బు రికవరు కావడం చాలకష్టము. భూమిశిస్తు వసూళ్ళేకాకుండా వారు లోన్సుకూడా వసూలు చేస్తున్నారు. ఏలూరు తాలూకాలోనే కొన్ని లక్షలు ద్రవ్యాపహరణ జరిగింది. అట్టి పరిస్థితులలో వెంటనే సస్పెండుచేసి తర్వాత విచారణ పెట్టకపోతే సాక్ష్యము రావడం కష్టం. గ్రామ వుద్యోగులు అధికారములోవుంటే రసీదులు యివ్వడం దొంగ సాక్ష్యమును సృష్టించడంకూడా జరుగుతుంది. అంతేకాక వున్నరికార్డులను దాచటమో లేక మార్పుచేయుటమోకూడా జరుగుతుంది. ప్రత్యేకముగా బంజర్ల పంపకం విషయములోకూడా అదేవిధముగా జరుగుతున్నది, కాబట్టి అనేక కారణాలవల్ల ప్రస్తుతములో ఈ జరుగుతూవున్న large scale ద్రవ్యాపహరణలు అరికట్టడానికి యీ బిల్లు అవసరమని చెప్పుతూ నేను బలపరుస్తున్నాను."

SRI M. NAGI REDDI;-"అధ్యక్షా, ఈ amendment తీసుకుని రావడం అనేది "ఉరిమి ఉరిమి మంగలవానిమీద పడిందట" అనే విధముగా ఉన్నది. నేనుకూడా ఒక permanent మునసబునే తరువాత రాజీనామా ఇచ్చినాను. అసలు ఈ Village Officers విషయములో ఏమి జరుగు తున్నదంటే, భాగ్యవంతులుగాఉండి పలుకుబడిగల మునసబులు, కరణాలు ఎంతటి ఘోరమైన పనులు చేసినప్పటికినీ, పరవాలేదు. Technical గా చూచుకుంటే శిస్తుల time లో వెంటనే వ్రాయవలసినటువంటివి కొన్ని ఉంటాయి. వాటికి జమ, ఖర్చు, చిట్టా వ్రాయవలసియుంటుంది. ఇదంతా సాధారణముగా Revenue Inspectors తహశీల్‌దార్లు ఉపేక్షిస్తూ ఉంటారు. కాని ఎప్పుడైతే వాళ్లకు రావలసినటువంటి ప్రతి ఫలము సరిగాముట్టదో అనాడు మాత్రము ఇవన్నీ బయటికి పెట్టడానికి తయారవుతూ ఉంటారు. ఈ వేళ ఏదో వారికి Village Officers కు జీతాలు పెరిగాయని ఒక గౌరవ సభ్యుడు చెప్పారు. మునసబుకు కరువు బత్తెముతోసహా 20 రూపాయలిస్తారట. మనకు ఇచ్చే $1\frac{1}{2}$ daily allowance వాళ్లకు నెలమొత్తానికి ఇస్తారన్న మాట. కరణానికి ఇంకొక 3 రూపాయలు హెచ్చు అంటే 23 రూపాయలు, వెట్టికి 18 రూపాయలు నెలకు ఇస్తారు. ఈ వేళ కూలిపనికికూడ రోజుకు రూపాయ రూపాయన్నర లేనిదే ఎవరురారు. మన కాంగ్రెస్ ప్రభుత్వము తయారుచేసి నటువంటి లెక్కల ప్రకారం ఒక మానవమాత్రుడు జీవించుటకు సరిపోయే టంతటి జీతమైన ఇవ్వకపోతె, వాళ్లకు తప్పని సరిగా పరోక్షంగా illegal పద తులు అనుసరించి సంపాదించుకొండి, అని ప్రభుత్వమే చెప్పుతున్నట్లు కాక మరేమికాదు. కనుక ఈ illegal పద్ధతుల ననుసరిస్తూ పై ఉద్యోగస్థులకు లొంగిపోయిన వాళ్లపైన తమ power చలాయిస్తూ వాళ్లనుండి ఆదాయాన్ని రాబట్టుటకు మాత్రమే ఈ సవరణ పనికివస్తుందిగాని, మరొకటికాదు 1947-48 సంవత్సరలో కరువువచ్చినప్పుడు రేషనింగు కంట్రోలు అదంతా ఉండి నపుడు పై అధికార్లను మేపడం అనేటటువంటిదాన్ని అంగీకరించనందుకు communists activities అనిచెప్పి మూడేళ్లు నన్ను జైలుకు పంపారు. వాళ్ల పుణ్యమాఅన్నట్లు దానివల్లనే కమ్యూనిస్టుగా తయారయిపోయాము. అందు వల్ల ఈవేళజరుగుతున్నదంతా ఈ corruption illegal పద్ధతులు అనుసరిం చడముతప్ప మరేమికాదు. జమాబంది టైములో ఒక్కొక్క మునసబు కరణము 70, 80 రూపాయలుమామూళ్లు ఇస్తున్నారనేది ఎవరికి తెలియనిదని అడుగుతున్నాను. ఈ విధముగా పరోక్షముగా లంచాలుతీసుకోండి అనేటటు వంటిది ప్రభుత్వమే చెప్పుతున్నదన్నమాట. ఎవరైతే పై ఆఫీసర్లను బాగా మేపుతారో వాళ్ల లోటుపాట్లన్నీ మాసిపోతాయి. ఇది ఇతర డిపార్టుమెంటు ఆఫీసర్లలో కూడ ఉన్నది. గురజాల డిప్యూటి ఇన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్స్ ఏదో నేరారోపణచేశారని లంచాలు చాలాతీసుకొన్నారని కనుక వారిని dismis

[SRI M. NAGI REDDI]

చేయవలసిందని వెంటనే transfer చేయవలసిందని petition District Educational Officer కు పెట్టుకొంటే petition transfer చేస్తున్నాము, విచారణ conduct చేస్తున్నాముఅని చెప్పతున్నారు అనేదికాదు. మామూలుగా ఆఫీసర్లు ఒక కలెక్టరుగాని, Revenue Divisional Officer గాని, క్యాంపుచేశారంటే, వారికి అనేక సప్లైలుచేసి నామ మాత్రానికి 3, 4 రూపాయలకు మాత్రమే బిల్లుఇస్తూఉంటారు. ఈలాటివన్నీ జరుగుతు ఉంటాయి. పైఉద్యోగస్థులను మెప్పించేందుకు (Interruption) అందుకనే మా అబ్బాయినీ ఈ service లో చేర్పించకూడదని అను కుంటున్నాను. ఇంకా మైనరుగా ఉన్నాడు. కనుక వాడు Village Officer ఇటువంటి illegal పద్ధతులపైన లంచాలపైన ఆధారపడకుండా ఉండాలంటే వారికి కనీసము మానవమాత్రుడు జీవించేందుకు కావలసిన వేతనముఉండాలి. తరువాత ఈ hereditary right అంటే వంశపారం పర్యంగావచ్చేటటువంటి హక్కు అనేటటువంటిది పోవాలి. ఈ redtapism అనేదితొలగించాలి ఏవిషయంలోనైనావెంటనేచర్యతీసుకోకపోతే suspension అని అంటున్నారు. కాని నిజంగా విచారణ వెంటనే చేయదలచుకొంటే ఎన్నాళ్ళు కావాలి? Records కావాలంటారు. మూడు మైళ్ళ దూరములో నున్న రెవిన్యూ ఇన్‌స్పెక్టరు తహశీల్‌దారును records బయట పెట్టమంటె పెట్టరూ? కాని అదికాదు వాళ్ల ఉద్దేశ్యము ఎవరికైతే పలుకుబడిఉందో వారి దగ్గర ఇవిబయటికి పెట్టరు, పెట్టారనుకోండి రేపు మళ్లీవారికిఉన్నపలుకుబడిని వినియోగించుకొని ఆ ఉత్తరువును రద్దుచేయించుకొని వారి suspension period లోను dismissal period లోను వారికి రావలసిన జీతాలను కోర్టు ద్వారా రాబట్టు కోనేటువంటి అవకాశం వాళ్లకుఉన్నది. కనుక ఏదైనాతప్పుచేస్తే నపుడు, వెంటనే 2, 3 దినాలలోనే విచారణ చేయవలసియుంటుంది. చేయద లచుకొంటే ఎప్పుడు పడితేఅప్పుడు చేయుటకు ప్రభుత్వానికి అవకాశమున్నది. కాని చేయుడంలేదు. కనుక దీనివల్ల చిన్న ఉద్యోగస్థులను influence లేనటువంటి వాళ్లను ఏదోచేయడం తప్పితే మరేమికాదు. అందుచేత దానిని మేము బలపరచలేకుండా ఉన్నాము. మేము చెప్పేది ఈ hereditary right అనేది ఈ Village Officers కు తొలగించి వారికి కనీస వేతనాలుఇచ్చి, వారి rights కు guarantee ఇచ్చి వారిని ఈ బాధలనుండి తప్పించే విధముగా చేస్తేనేగాని లేకపోతే ఇది ఏ అనామికులనో, పలుకుబడి లేనివారినో తేనిపోని బాధలకు గురిచేసే దానికి తప్పితే మరేమి ప్రయోజనము ఉండదు. కనుక దీనిని మేము బలపరచ జాలమని మనవిచేస్తున్నాను"

**Sri M. SATYANARAYANA RAJU** "అధ్యక్ష మహాశయా! చాలామంది సోదరులు ఈ Village Officers గురించి చెప్పారు. కాని వారు ఒక విషయం ముఖ్యంగా గుర్తించవలసియున్నది.

[SRI M. SATYANARAYANA RAJU]

Village Officers కున్ను regular lineలో ఉన్న officers కున్ను చాలా తేడా ఉన్నది. Village Officers కేవలం తమ వంశ పారంపర్యంగా వచ్చిన గౌరవార్థంకోసం పాటుపడుతారు. అంతేగాని నాగిరెడ్డిగారు చెప్పి నట్లు వారికిచ్చే 20, 23 రూపాయలకు కాదు. అంతమట్టుకు కూడ వాళ్ళ జిల్లాలో ఇస్తున్నారేమో కాని మా జిల్లాలో village మునసబుకు 14 రూపా యలు, కరణానికి 16 రూపాయలు మాత్రమే ఇస్తున్నారు. వారు ఆ 14, 16 రూపాయలకు పాటుపడడంలేదు, కాని వాళ్ళ తండ్రి, తాత సంపాదించినటు వంటి ఉద్యోగాన్ని, అది ఏలాగైనాసరే గౌరవార్థంగా నిలబెట్టుకొనేందుకు తాపత్రయపడుతారు. జీతముకోసం ఆ పని చేయడంలేదు తరువాత ఇక్కడ గమనించవలసింది ఎవరైనా కొంత తప్పు చేస్తే suspend చేసి తరు వాత enquiry చేయవలసిందని ఈ బిల్లులో ప్రతిపాదించబడింది. మా సోదరులు comrade చెప్పినట్లు, enquiry చేయడంలో ఎంతమాత్రం కష్టం లేదు. అక్కడ హెచ్చు జీతం తీసుకొనే Revenue Inspector అంత కంటె హెచ్చుగా తీసుకొనే డిప్యూటి తహశీల్దారు ఉన్నారు. వారిచేత రికార్డు తెప్పించి ప్రభుత్వము on the spot తప్పు ఉన్నదా లేదా అని తెలుసుకోడానికి వీలున్నది. ఆ విధంగా చేయవచ్చును. తరువాత ఇంకొక విషయం గమనించవలసియున్నది. మనకు స్వరాజ్యం వచ్చిన తరువాత, పల్లెటూళ్ళలో చాలా పార్టీ విభేదాలు వచ్చాయి. వంశ పారంపర్యంగా వస్తున్న ఈ హక్కును, ఉద్యోగాన్ని ముప్పాతిక తప్పించి దాన్ని ఏదోవిధంగా కాజేస్తామని ప్రయత్నించేవారు చాలామంది ఉన్నారు. వారు ఏదో ఒక అవ కాశము తీసుకొని ఇది సాధించవలెనని చూస్తున్నారు. మన సోదరుడు చెప్పినట్లు, వారు రివిన్యూ ఇన్స్పెక్టరును, తాహశీలుదారును ఏదో విధంగా influence చేసి ఆ ఉద్యోగాన్ని పుచ్చుకోడానికి తాపత్రయ పడతారు. ఆ విధంగా permanent ఉద్యోగి చాలా కష్టాలకు గురి కావలసిఉంటుంది. కనుక ఇది ముఖ్యంగా గమనించవలసియుంటుంది. మన రాష్ట్రంలో 16 వేల గ్రామలున్నాయి. ఇన్ని గ్రామాలలో hereditary system తీసివేసి, ఇతరులకు ఇప్పుడిచ్చే 14, 16 రూపాయలకు నియమించుట సాధ్యంకాదు. కనుక వీరికి ఇతర ఉద్యోగస్థులకు ఇస్తున్న విధముగాకనీస జీతాలు ఇచ్చి, తరువాత ఇప్పుడు ప్రతి గ్రామములోను పంచాయితీలు ఏర్పరుచ బోతున్నారు కదా, ఆ పంచాయితీలలో, వీరిని executive officers గా చేయవలసి ఉంటుంది. ఆ విధంగా చేస్తే ఇది సక్రమంగా ఒక పద్ధతిలో రాగలదు గాని అంతవరకు ఈ బిల్లు సక్రమంగా అమలు జరుపబడుతుం దని చెప్పలేను. ఆ విధంగా చేయాలంటే, ప్రస్తుతం గవర్నమెంటు ఆ position లో లేదు. 16 వేల గ్రామాలలో ఆ విధంగా కనీస వేతనాలు ఇవ్వాలంటే. ఎన్ని లక్షలు కావలసి ఉంటుందో ప్రభుత్వానికి తెలుసు.

[SRI M. SATYANARAYANA RAJU]

కనుక, ప్రస్తుత పరిస్థితులలో ఎవరైనా తప్పుచేస్తే యీ విధంగా ముందు suspend చేసి తరువాత enquiry చేయడంవల్ల opposite forces కు తగిన సావకాశమిచ్చి బలము చేకూర్చినట్లవుతుంది. కనుక వెంటనే on the spot ఆఫీసర్లచేత enquiry చేయించి తప్పు ఉన్నట్లయితే punish చేయ వలసిఉంటుంది. ఆ విధంగా కాకుండా తరువాత ఎప్పుడో enquiry చేస్తామంటేన్యాయం జరుగదని, పరిపాలన ధర్మంగా జరుగదని మనవిచేస్తున్నాను.

మొదటనే నేను మనవిచేసియున్నాను. అన్ని departments లాగా అందరిమాదిరి ఉద్యోగస్తులు లాగా, వీరు కారు. వారు గౌరవంగా వారి తండ్రి తాతలు ఏ విధంగా పారంపర్యంగా వంశమర్యాదలు నిలబెట్టుకుంటూ వచ్చారో అదేమాదిరిగా యీ వుద్యోగస్థులు కూడా వారి యొక్క వంశ పారంపర్య హక్కును నిలబెట్టుకోటానికి తాపత్రయ పడుతారని, తక్కిన వుద్యోగస్థులమాదిరి కాదని, యీ వుద్యోగాలకు యితర డిపార్టుమెంటులలోని వుద్యోగాలకును చాలా బేధాలు వున్నవని ప్రభుత్వము గుర్తించాలని మనవి చేస్తూ విరమిస్తున్నాను.

Sri S. VEMAYYA.—అధ్యక్షా, ఇప్పుడు మనముందు వున్న ఈ సవరణ బిల్లు బహుశ యిదివరకు రెండు మూడు పర్యాయములు శాసన సభ ముందుకు వచ్చి తిరుగు ముఖము పట్టింది. కాని దీన్ని pass చేయటానికి మరల యిప్పుడు శాసన సభ ముందుకు వచ్చింది. ఈ బిల్లును పురస్కరించుకొని నేను కొన్ని సూచనలను చేయదలచాను. ఈ బిల్లును బట్టి గ్రామాధికార్లకు వున్నటువంటి privileges ను తీసివేస్తున్నాము. ఈ privileges ను తీసివేసేటప్పుడు, కనీసము వారియొక్క జీతాల విషయమైనా ప్రభుత్వం ఆలోచిస్తున్నారా అంటే, అదేమి కనబడడము లేదు. పోనీ, యింకను వారికేమైనా సౌకర్యాలు కలుగజేస్తున్నారా ? వారికున్న ప్రతిబంధకాలు తొలగిస్తున్నారా ? ఇవిగూడా యేమీ కనబడడములేదు. ఒక సభ్యుడు మాట్లాడుతూ, వారు గౌరవంగా చేస్తున్నారని చెప్పారు. నిజంగా చూస్తే, వారికి గౌరము బదులు వచ్చేవి అన్ని చీవాట్లేనని అందరికి తెలుసు ననుకుంటాను. ఈ విషయాలు మనము ఎన్నోచోట్లనుండి వింటున్నాము. వారికి యిచ్చే వేతనాలు గూడా మనకు తెలుసు. మనలో యిక్కడ వున్న సభ్యులలో నూటికి ఏ ఒకరో యిద్దరోతప్ప ఏదో రూపేణ యీ గ్రామాధికార్లకు ముట్టజెప్పారని గూడా నేను భావిస్తున్నాను. ఈ రహస్యము మన కందరకు తెలుసు. ముఖ్యంగా వారికి జీతాలు పెంచడము విషయము ప్రభుత్వము ఆలోచించినట్లు లేదు. ఈ విషయము మనకు అర్థికంగా ప్రతిబంధకమయ్యే పక్షములో మూస్తే, ఒక సంగతి గమనించాలి. తాలూకా ఆఫీసులకుగాని, డిప్యూటి కలెక్టరు ఆఫీసులకుగాని వారిని రమ్మని సమనులు చేస్తే కనీసము వారికి రానుపోను ఖర్చులుగాని బత్తాలుగానియివ్వడానికి ప్రభు

[SRI S. VEMAYYA]

త్వము ముందుకురావడం అత్యంతఅవసరమని ప్రభుత్వదృష్టికి నేను పదేపదే తెస్తున్నాను. పోతే, యీ రెండు విషయాలు కాకుండా ఒక ప్రశ్న రెవిన్యూ మంత్రిగారిని అడిగి, దానికి వారు సమాధానం చెప్పినతరువాత నేను నా ఉపన్యాసమును ముగిస్తాను. దీనిలో Village Officers అనే దాని క్రిందకు ఎవరెవరు వస్తారు అనేది నాకు తెలియపర్చగోర్తాను. Village Officers village servants వెట్టీలు, తలార్లు, అంటే ఎవరు అనేది నిర్వచనము కావాలి. ఈ definition లో whether it includes village servants also అనేది చెప్పవలసి యున్నది.

MR. SPEAKER:—"It will be found in the village servants Act."

Sri S. VEMAYYA.— నాకు తెలిసినంతమట్టుకు Village Officers అంటే బహుశాః (Interruption.)

The Hon. Sri K. CHANDRAMOULI — "అసలు యీ బిల్లులో వున్న objects and reasons లోనే యిదంతా వున్నది. Village Officers అంటే Karnam, Munsiff, Police అని వున్నది. వెట్టి, తలారీ మొదలైన వారిని గురించి గూడా అందులోనే వున్నది.

Sri S. VEMAYYA — అయితే యిప్పుడు నాకు ముఖ్యమైన సందేహము ఒకటి వచ్చింది. గ్రామాధికార్లు అంటే Village Officers అనేది యీ definition లో వుండాలి. అనేకమంది సభ్యులు గ్రామాధికార్లు అంటే Karnam, Munsiff అని ఎంతసేపటికినీ అదే దోరణిలో మాట్లాడుతూ వచ్చారు. అయితే యిందులో వెట్టి, తలారి నీరు కట్టు అనే వారు కూడా యీ Village Officers ను గురించిన నిర్వచనములోనే వున్నప్పుడు, దీన్ని మనము ప్యాసు చేస్తే, గ్రామాధికార్లకంటే గ్రామ నౌకర్లమీద దెబ్బ తీయటానికి వీలవుతుంది. ఇప్పటికే యీ గ్రామ నౌకర్లను గ్రామాధికార్లు వారియొక్క ఆటవస్తువుల మాదిరిగా చూచి బాధ పెట్టుతున్నారు. గ్రామాధికార్లు గ్రామ నౌకర్లను ప్రభుత్వ వ్యవహారాల మీద పంపినప్పుడు, వారి స్వంత పనులకు గూడా పంపడము కద్దు. కాబట్టి గ్రామాధికార్లు అనే నిర్వచనములో నుంచి యీ గ్రామ నౌకర్లను మినహాయించి, వారికి కనీసము న్న privileges ను వుంచి ఒక రక్షణ కలిగిస్తే బాగా వుంటుంది. ఈ బిల్లును గ్రామోద్యోగస్థులకు మాత్రమే వర్తింపజేస్తే, గ్రామ నౌకర్లకు గ్రామాధికార్ల బాధ తప్పిపోతుంది. లేకపోతే గ్రామములో పనిచేసే వెట్టి, తలారి, వీరిమీద గ్రామాధికార్లు రిపోర్టు చేయడం, వారిని suspension లో పెట్టడం కాకుండా యింకను వారి వుద్యోగాలు వూడపీకటానికి కూడా అవకాశాలు వుంటవి. అందువల్ల యీ బిల్లు ప్యాసుచేసేముందు, గ్రామ నౌక

ర్లను యిందులోనుంచి మినహాయింపు చేస్తే, వారికి మాత్రం రక్షణకలిగించిన వారమవుతాము. ముందు యీ గ్రామ నౌకర్లు గ్రామాధికార్ల బాధనుంచి తప్పించుకున్నవారవుతారు. ఇంతకుముందు డిప్యూటి కలెక్టరుగాని, కలెక్టరుగాని ఏదైనా ఉత్తరువులు ప్యాసు చేసినను (Interruption)."

Sri P. RANGA REDDY.— "రివిన్యూ మంత్రిగారు ప్రతిపాదించిన సవరణమీద వేమయ్యగారు సవరణ ప్రతిపాదిస్తున్నారా ?"

Sri S. VEMAYYA.—"ఇదివరకు డిప్యూడి కలెక్టరుగాని, కలెక్టరుగాని చట్టాలు వున్నప్పటికినీ, చట్టాలకు వ్యతిరేకముగా suspension వగైరా orders pass చేస్తూవున్నారు. అందువల్ల వచ్చే యిబ్బందులు సమర్థించటానికి యిప్పుడు యీ బిల్లును తీసుకొనివచ్చినట్లుగా కనబడుతున్నది. వారు suspension వగైరా అర్డర్లు చట్టాలకు వ్యతిరేకంగా ఎంతమంది గ్రామాధికార్లమీద pass చేశారో, జిల్లావారీగా కాకుండా రాష్ట్రము మొత్తము మీద పరిశీలించి చూస్తే తెలుస్తుంది. తరువాత ఎంతమంది ఉద్యోగస్థులు బాధపడ్డారో, ఎంతమంది ఆఫీసర్లు యీ విధంగా ఆర్డర్లు pass చేశారో, ఆలోచించాలి. ఆ విధంగా ఆర్డర్లు pass చేస్తే, ఎందుకు pass చేశారు అని యీ ప్రభుత్వము అడిగిందా ? అటువంటి ఆఫీసర్లమీద charges ఏమైనా పెట్టి వారి యొక్క సంజాయిషీలు తెప్పించారా ? Charges frame చేసి, వారిని ఏవిధంగానైనా యీ ప్రభుత్వము శిక్షించిందా ? అటువంటి కేసులు ఎన్ని వున్నవో ప్రభుత్వము యిక్కడ శాసనసభముందు ఎందుకు పెట్టగూడదు అని ప్రశ్నిస్తున్నాను. ఇదంతా రెవిన్యూ మంత్రిగారు, సభ్యులు గుర్తిస్తారని ఆశిస్తూ యింతటితో విరమిస్తున్నాను."

Sri VAVILALA GOPALA KRISHNAYYA అధ్యక్షా, —"ఈ బిల్లు విషయములో నేనొక సంగతి మనవి చేయదలచాను. ఇదివరకు కొన్ని కేసులలో కొంతమందిని అరెస్టు చేయడముకూడా జరిగింది. తరువాత వారిని జయిళ్లకు పంపడంకూడా జరిగింది. వారు జయిళ్లలో వున్నప్పుడు వారిని సస్పెండు చేయడానికి వీలులేకుండా పోయిన కారణంచేత, ప్రభుత్వము వారు చేయబూనిన చర్య డిస్‌క్వాలిఫై అవుతుందనే అభిప్రాయముతో అది సమర్థించటానికి యీ బిల్లును ప్రభుత్వమువారు తీసుకువచ్చారని నా అభిప్రాయము. నిజముగా అందు కొరకే అయితే దానికోసం యిప్పుడు యింత పెద్ద బిల్లును తీసుకొనిరానవసరంలేదు. దీనిలో ఒక మాట వున్నది. ఫిజికల్‌గా వారు హాజరు కావటానికి వీలులేదు అనే మాట వున్నది. అంటే Physical or mental incapacity to discharge the duty అని వున్నది. అది వుంచివేసి, మేము సస్పెండు చేశాము. ఇమిడియట్, గా ఆ విధంగా చేయకపోతే, చాలా చిక్కులు వస్తాయి అని చెప్పివేస్తే చాలా బాగావుండేది. పైగా యిందులో definition లో గూడా విలేజి ఆఫీసర్సు అని

[SRI VAVILALA GOPALAKRISHNAIAH]

వున్నది. విలేజి ఆఫీసర్సు అంటే యిందులోకి ఎవరెవరు వస్తారంటే Village Accountants. Heads of Villages, Village watchmen, or Police officers వీరందరు వస్తారు. తరువాత యింకొక బిల్లు వున్నది. ఇందులోకి ఎవరు వస్తారంటే Hereditary officers of Village artisans and Village servants వస్తారు. దీనిక్రిందకు ఎవరెవరు వస్తారంటే, Village Carpenter, Barbar, washerman, Potter, Astroleger, Purohit, etc. (Laughter) [interruption] వారికి స్వతంత్రము లేదంటే నాకేమి అభ్యంతరములేదు. ఇప్పుడు ఈ ఆక్టులో Definitions అన్నీ చదివాను. అది ప్రభుత్వమువారు కాదంటే బహుశ యిదివరకు ఆ మాదిరిగా యాక్టు ప్యాసు అయిందేమో కాని యిందులో మాత్రము అది కనబడలేదు. అది ప్యాసు కాకపోతేమాత్రం, యిది లాభంలేదు అందువల్ల యిప్పుడున్న పరిస్థితులలో వి. ఓస్. అంటె ఒక్కరేకాదు యీ బిల్లు ప్రకారము ఇందులో రెండు రకములుగావున్నది. ఒక బిల్లులో విలేజి ఆఫీసర్సు అని, రెండవ బిల్లులో విలేజి Services అని వున్నది. ఈ రెండురకములు కలసిన బిల్లును ఇప్పుడు తీసుకొని వచ్చారు. కనుక యీ బిల్లు ఎవరెవరిని సమన్వయ పరుస్తుందంటే, యిందులోనుంచి ఎవరినైనా తీసివేయటానికి అవకాశమున్నది. అయితే రైతువారీ సంగతి ఆలోచిస్తే, యీ బిల్లు వారికి ఎట్లా అన్వయిస్తుంది అని అనుకోవచ్చు. (interruption):— అయితే మీరు పురోహితం చేయడంలేదు) నేను పురోహితం చేయడంలేదు. గనుక ఎవ్వరిని బాధించదు.—Laughter)

" అందువల్ల యిది enabling Act అని నా అభిప్రాయం. ఇదివరకు కొంతమందిని సస్పెండు చేశారు. వారి విషయంలో ఏదైనా యిబ్బంది వస్తుందని, యీ బిల్లును యిప్పుడు తీసుకొనివచ్చారని నా అభిప్రాయము. కాని మొత్తముమీద చూస్తే, ఏమాత్రం అనుమానం వున్నప్పటికిన్నీ వాళ్ళను తీసిపారవేయటానికి వీలున్నప్పుడు, అప్పుడు చాలా ప్రమాదస్థితి కలిగించిన వారవుతారు అందువల్ల మంత్రిగారు యీ బిల్లు విషయములో బాగా ఆలోచించి యీ బిల్లులోవున్న Provisions లో 'Physically impossible' అంటే జెయిలులో వుండేవాళ్లను తీసివేయటానికి వీలులేకుండావుండే ప్రొవిజనును తీసివేయాలని ఒంటున్నాను. పైగా యీ బిల్లు రైతువారీకి సంబంధించింది కాదు. ఈనాములకు సంబంధించింది. ఈనాములకు సంబంధించినప్పుడు రాబోయే హెరిడిటరీ హక్కులకు తక్కినవాటికి చాలా తేడా వుంది. కాబట్టి, ఇప్పుడు రైతువారీ విధానానికి యిది apply కాదు. కాబట్టి, వారికోసమైనా యిప్పుడు దీన్ని తీసుకొనివచ్చాము అని అంటున్నారు. ఈ బిల్లు ప్రకారము categories లో తేడావుంది. Village officers అంటే యింతమంది కలిసి వచ్చారు. లేకపోతే విలేజి ఆఫీసర్సు అంటే

[SRI VAVILALA GOPALAKRISHNAYYA]

Karnam and Munsiff మాత్రమే యిందులోకి వస్తారు. తక్కినవాళ్లు రారు. అందువల్ల మంత్రిగారు యీ విషయం తీవ్రంగా ఆలోచించాల్సి వున్నది. ఆ విధంగా మార్చకపోతే, వీరందరిని వరుసగా తీసిపారవేయ టానికి వీలుంటుంది అట్లా తీసివేస్తే, వారికి పొజిషన్ పోయిన తరువాత యిక వచ్చేది ఏమీ వుండదు. అందువల్ల యీ Categories లో మార్పు లు చేయమని కోరుచున్నాను. ఇప్పుడు యీ పద్ధతిలోనే మార్చటానికి వీలు వుంటే, అది మారిస్తే, అందరు అంగీకరించటానికి వీలవుతుందని సూచిస్తూ విరమిస్తున్నాను."

Sri M. MATCHARAJU —"అధ్యక్షా! మా ఏజన్సీలో ఉండే విష యం ఏమంటే village officers గురించి తమరు సెలవిచ్చారు. Village Officer లూ లేరు ఎవరూలేరు. మామూలుగా Revenue Inspector రావడం ఒక ఏడాది శిస్తు వసూలుచేసేచోట రెండేళ్ళ, మూడేళ్ళ శిస్తు వసూలు చేస్తున్నారు. ఈవిషయం village officers గాని, ముఠాదార్లు కాని ఏదీ definite గా తేల్చలేదు. ఏది కాకుండా వుండిపోతుంది. ఇంత వరకూ జీతాలుకాని ఇంకా appointment కాని ఇవ్వలేదు. ఇంతలో Revenue Inspector వచ్చి హెచ్చు భూమి పన్ను కట్టవలసిందేకాని వేరే విధం లేదని అమాయకులైన ప్రజలకు జెప్పి, రైతులవద్ద ఒక రూపాయిఇవ్వ వలసిన వారి దగ్గర 2 రూపాయలు, 2 రూపాయలు ఇవ్వవలసిన వారి దగ్గర నాలుగు రూపాయలు excess వసూలు చేస్తున్నారు. అటువంటి అన్యాయం జరుగకుండా, ప్రభుత్వమువారు అరికట్టించి Village Officers ను జీతం మీద appoint చేయించమని ప్రభుత్వమువారిని కోరుతున్నాను."

SRI P. SUNDARAYYA :—"అధ్యక్షా! ఈ బిల్లు చూచేటప్పుడు మాత్రం చాలా సవ్యమైనదిగా కనిపిస్తుంది. మొదట చదివినప్పుడు 'దాని లో ఏముందిలే' బలపరుద్దామనిపిస్తుంది. కాని అది 60 ఏండ్ల క్రితం ఎప్పుడో 1894 లో వ్రాసిన Act. ఈ 60 ఏండ్లుగా దానికి సవరణ రాలేదు. 60 ఏండ్లుగా ప్రభుత్వం సాగింది. సంజీవరెడ్డిగారు చెబుతూ సవరణ చేశా మన్నారు. ముందు చెప్పవలసింది ఏమిటంటే ఎంతమందిని suspend చేశారు? ఏ ఏ కారణాలచేత చేశారు? ఇటువంటి కష్టాలు మనల్ని ఎదు ర్కొంటూ యున్నవి కాబట్టి, చట్టంలో అధికారంలేదు కాబట్టి, ఈ అధి కారం కోరుతున్నామని చెప్పవలసి యున్నది. పలుకుబడి కలవారిని ఎవరి నైనా suspend చేశారా? ఎక్కడైనా misappropriation జరిగితే తప్పకుండా చేయవలసిందే. కమ్యూనిస్టులు ఇది చేయిస్తున్నారు, అది చేయిస్తున్నారనడం అలవాటయిపోయింది. కమ్యూనిస్టులు misappropriation చేయమని చెబుతున్నారా? Gross neglect of duty, dis-

[SRI P. SUNDARAYYA]

regard of lawful orders ఉన్నప్పుడు అనిచెబుతున్నారు ఈ I. P.C. section ల నిర్వచనం మొదలు పెడితే చాలాదూరం పోదు."

Mr. SPEAKER :— "తరువాత Budget general discussion లో ఆ విషయాలన్నీ వస్తాయి."

SRI P. SUNDARAYYA— "Physical or mental incapacity, any act involving breach of peace rules మొదలుగా ప్రభుత్వం ఇంకా ఏమి include చేస్తుందో చెప్పలేం. అడిగినప్పుడు గ్రామోద్యోగస్తులు న్యాయం చెయ్యడంలేదు. కొంతమంది అక్రమం చేయడంలేదా ? అది మార్చుటకు ఇదే పద్ధతా ? కానేకాదు. కొంతమంది జీతాల విషయమై చిక్కి లేదంటున్నారు. దీని అర్థమేమిటి ? ప్రభుత్వాధికారం, పలుకుబడి కలవారు, భూస్వాములు, పెత్తందార్లు. వారిని ఆధారంగా చేసుకొని పరిపాలించగలమే కాని, సక్రమంగా విద్యాబుద్ధులు కలిగినవారిని కడుపునిండా తిండిపెట్టి ఉద్యోగంలో ఉంచుకుని పరిపాలించ లేమనేగదా ? బ్రతకగల్గినవారిద్వారానే పరిపాలన చేస్తాం. అనే విషయం చాలా సాహసించి చెప్పే విషయం వారికి ఆస్తులు లేకపోతే, పలుకుబడే లేకపోతే, ఇదివఱకు పలుకుబడి లేకపోతే ఏజన్సీ ప్రాంతంలో నెలకు రెండు రూపాయలకు కొన్నిచోట్ల రూ 24 లకు కొన్నిచోట్ల రూ 23 లకు ఈ ఉద్యోగం చేస్తారా ? ఈ జీతాలకు, లంచాలకు ఆశపడకుండా, అన్యాయాలూ, అక్రమాలూ చేయకుండా గ్రామాలలో తమ కార్యక్రమం నడపడం ఏవిధంగా సాధ్యమవుతుందో నాకు తెలియడంలేదు. సాధ్యంకానేకాదు. అలాంటిది పోవాలి కాబట్టి మీరు చట్టం మార్చితే, కాంగ్రెసు కమిటీలు ఏమిచెబుతాయి? పంచాయితీలకు సర్వాధికారాలు ఇస్తేగాని గ్రామ స్వరాజ్యం కాదంటారు. ఏమయింది ఆ చట్టాలు, ఆ ఆశయాలూ ? ఇదేమిటి ? 60 ఏండ్లుగా ఉన్న చట్టం మార్చి Village Officer లను suspend చేసే అధికారం తీసుకోవడమా ? ప్రభుత్వోద్యోగులు ఎవరిమీదనైనా ఫిర్యాదు వస్తుందనుకోండి సంజాయిషీ అడుగుతారు. Expation ఇచ్చినతరువాత దాన్ని ఆధారంగా తీసుకుని action తీసుకుంటారు. ఒకరకమైన నేరాలకు, దానిలో నేరంచేసే స్వభావం ఉన్నదా, లేదా అనేటంత లోతుగా పోయి ఆలోచిస్తారు. గ్రామోద్యోగస్థుల విషయంలో ఈ విధంగా సంజాయిషీ అడిగి suspend చేస్తామనికూడా ఈ బిల్లులో లేదు. అందుచేత సంజాయిషీ fundamental right"

THE HON. Dr. B. GOPALA REDDI— "Enquiry చేస్తే సంజాయిషీ కోరడం ఉంటుంది. Suspension లో పెట్టుటకు సంజాయిషీ అవసరంలేదు.

7th July 1955]

SRI P. SUNDARAYYA :— "Enquiry లో సంజాయిషీ ఒక భాగం ఐతే సంజాయిషీ అనే పదం చేర్చకుండా ముందు suspend చేస్తాం అంటే, ఇదే ఈ బిల్లులోయుండే పొరపాటు. ఏ ఉద్యోగి అయిన సరే-గ్రామోద్యోగిగాని, ఇతర ఉద్యోగిగాని-సంజాయిషి కోరనిదే suspend చేసేహక్కు, పై ఉద్యోగస్థునికి గాని, ప్రభుత్వానికి గాని ఉండకూడదు. సంజాయిషీ కోరినతరువాత చేయాలనేది మొదటి point."

THE HON. SRI K. VENKATA RAO :— "సుందరయ్యగారు ఈ సంజాయిషీ విషయం confuse చేస్తున్నారు. మామూలుగా జరిగే enquiry లో గవర్నమెంటు ఉద్యోగస్థులను సంజాయిషీఅడుగుతారు. Village ఆఫీసర్లనుకూడా అదేవిధంగా అడుగుతారు. చాలా గొప్ప నేరం జరిగినప్పుడు suppression of evidence, అంటే suspend చేస్తేగాని enquiry జరగదు, సాక్ష్యం అణచివేయబడుతుందనే కారణంచేత నూటికీ కోటికీ ఒక్క కేసులో, అదికూడా extraordinary కేసులలో సంజాయిషీ కోరకుండానే అంటే enquiry లో suspend చేస్తారు. అది అప్పుడు apply అవుతుంది కాని, suspension తో start చేసే కేసులలో సంజాయిషీ విషయం తరువాత వస్తుంది. ఏదో చేస్తారనే అభిప్రాయానికి మామూలుగా administrative affairs లో అవకాశం లేదు. Extra-ordinary cases లో suspension సమాచారం వస్తుంది కాని, సాధారణంగా అన్ని కేసులలో రాదు. ఇదే village ffiicers కు apply చేస్తున్నారు. ముందుకూడా చేస్తారు."

SRI P. SUNDARAYYA :— "అదిచేసినప్పుడు ఈ బిల్లు అనవసరం. నూటికి కోటికి జరుగుతుంది అంటున్నారు. ఎక్కడో murder కేసులు జరిగితే తొందరమీద కేసులు పెడతారు. జైలులో పెడతారు ముందు murder చేసినవాళ్ళమీద పెడితే బాగానేయుంటుంది. సంతోషమే. చేయనివాళ్ళమీదకూడా ఇట్టి అక్రమం జరుగుతోంది. ఎక్కడో హత్యలు జరుగుతున్నాయని ఇది సాంప్రదాయం కారాదు. చట్టము సవ్యంగా అమలు జరుగుతోందా అనే అనుమానానికి తావు ఇవ్వకూడదు. అమలు జరగడంలో క్రొత్త అధికారం కోరినప్పుడు చిన్నఉద్యోగస్థులకు ప్రమాదకరం. గ్రామోద్యోగస్థులను సక్రమంగా పనిచేయించాలంటే ఈ విధానం మార్చి వంశ పారంపర్యా ఉండే పెత్తనం తీసిపారవెయ్యాలి. ఒక పరీక్ష పెట్టి అర్హతకలిగినవారిని న్యాయమైన జీతంమీద, కుటుంబ పోషణకు సరిపోవునట్లుగా జీతం ఇచ్చి ఏర్పాటుచేయండి. పై ఉద్యోగస్థులలో లంచగొండితనం లేనట్లు, అక్రమంవారు ఉన్నారని భావించవద్దు. సంజాయిషీతీసుకుని, విచారణ చేసే పద్ధతికోసం పోరాడుతున్నాం.

[SRI P. SUNDARAYYA]

"ఈ చట్టములో ప్రొప్రైటరు అనేమాట తీసుకొని వచ్చారు. పెద్దపెద్ద ఎస్టేట్లు ఉన్నాయి. ఇనాము ఎస్టేట్లు ఉన్నాయి. వారికి అధికారము ఇవ్వటము చాలా బుద్ధి తక్కువ. వారు పొరపాట్లు చేయవచ్చును.

'The proprietor may place under suspension the holder of any of the offices referred to in this section, pending inquiry into charges against him of misappropriation, gross neglect of duty, disregard of lawful orders, tampering with records, physical or mental incapacity to discharge the duty or any act likely to involve breach of peace; and shall make a record of his reasons for so doing in writing and furnish a copy of the same to the village-officer concerned.'

"మంచిపని జరిగినప్పుడు మేము ఎప్పుడుకూడా సంతోషించుతాము. ప్రొప్రైటరు విచారణచెయ్యకుండా సస్పెండు చేసే అధికారము లేదు. బిల్లు objects లో ఏమన్నారు. Also confers the same power on the proprietors. వారు ఇంకా ఎంతమంది ఉన్నారు? గోపాలకృష్ణయ్యగారు చెప్పినట్లు ఇంకా ఎందరో లేరు. ప్రొప్రైటరుకు వారిని సస్పెండుచేసే అధికారములేదు. ఆ అధికారము ఇవ్వడం అన్యాయము, శుద్ధ పొరపాటు. రెవెన్యూ ఆఫీసర్లకు ఇవ్వవచ్చును. ఈ అర్థములేని బిల్లు ప్రజల స్వతంత్ర హక్కులకు నష్టం కలుగచేస్తుంది. కాబట్టి ఇంక్వైరీచేసే పద్ధతి ఏర్పాటు చెయ్యవలయును. ఇది నిరుపయోగమైన చట్టము కాబట్టి దానిని త్రోసి వెయ్యవలెనని కోరుచున్నాను".

THE HON. SRI K. CHANDRAMOULI:— "అధ్యక్ష మహాశయా, ఇప్పుడుఎన్నో అప్రస్తుతమైన విషయాలు చెప్పారు. వానికిసమాధానము చెప్పడము భావ్యముకాదు. అయితే ఒకటి రెండు విషయాలు మాత్రం చెబుతాను. ఎవరైనా నేరము చేసినారనే అధారము దొరికినపుడు వారిని ముందు సస్పెన్షనులోపెట్టి తరువాత విచారణ జరుగవలెనా లేకపోతే విచారణ అయినతరువాత సస్పెన్షనులో పెట్టవలెనా అనేది పాయింటు. విచారణ అయిన తరువాత సస్పెన్షనుకు అగత్యముండదు. వెంటనే శిక్ష వేయవచ్చును."

SRI PILLALAMARRI VENKATESWARLU:— "నేరము చేసినాడని నిర్ధారణ అయినప్పుడే సస్పెండు చెయ్యవలెను. విచారణచేసి ఛార్జీలు నిజమైతే శిక్ష వెయ్యవచ్చును"

THE HON. SRI K. CHANDRAMOULI:— "సస్పెన్షను అనేది పనిష్మెంటు కాదు. ఇంకో విషయము ఉంది. ఈ బిల్లు కలవారికి రక్షణ ఇవ్వడానికి, పేదవారిని అణచడానికి ఉద్దేశింపబడునని అంటున్నారు. నేరము ఎప్పుడుకూడా పలుకుబడి గలవారే చేస్తారు. పేదవారు పలుకుబడి లేనివారు తప్పుడు పనులు చెయ్యరు. కాబట్టి పలుకుబడి గలవారికే ఈ బిల్లు పెట్టినది. కొంత ఆధారము దొరికినా రుజువుకాకుండా చేస్తున్నారు కాబట్టి ఆ పరిస్థితులులేకుండా చేసి శిక్ష విధించడానికి అవకాశము కల్పించడం ఈ బిల్లు ఉద్దేశము. నేరము రుజువుకాకపోతే సస్పెన్షనునుండి తీసివేస్తాము. ఈ చిన్న సవరణగురించి తర్జన భర్జన జరగవలసిన అవసరము లేదు కాబట్టి, గౌరవసభ్యులందరు కూడా సవరణచేసిన ఉద్దేశము ఉచితము కాబట్టి, దీనిని ఆమోదించవలెనని నేను కోరుచున్నాను."

MR. SPEAKER. The question is:—

"That the Madras Proprietary Estates' Village Service and Hereditary Village Offices (Andhra Amendment) Bill, 1955 be taken into consideration at once."

The motion was carried.

MR. SPEAKER:—Detailed consideration of the Bill will be taken up later on.

The House adjourned to meet again at 11 a.m. the next day.